## చిన్న మనవి :

కథకునిగా సంపాదించిన కొద్దిపాటి అనుభవంతో, కొందరు మిత్రుల ప్రోత్సాహంతో, యీ నాటకం రాయటం జరిగింది. రంగస్థలానుభవం అధికంగా లేకపోయినా, వున్న పాటి అనుభవాన్ని పురస్కరించుకుని, ప్రదర్శనానికి అనుకూలంగా వుండేవిధంగా రాయటానికి ప్రయత్నించాను. ఎంతవరకూ నా ప్రయత్నం ఫలించిందో నిర్ణయించాల్సింది మీరు. ఈ నాటకాన్ని ఆదరించి, నన్ను ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను.

ఈ నాటకాన్ని ప్రప్రథమంగా ప్రదర్శించి, పలువురి పొగడ్తలను పొందిన ఆపరేటింగు కల్చరల్ యూనిట్ (ఖర్గపూర్)వారికీ, సీరియల్‌గా తమ పత్రికలో ప్రచురించిన 'జాగృతి' సంస్థవారికి, పుస్తకరూపంలో తెచ్చిన ఆదర్శ గ్రంథమండలివారికీ, నా కృతజ్ఞతాభివందనాలు.

—రచయిత

నిమిత్తమాత్రులు నాటకాన్ని ....

ఖర్గపూర్ నార్తు ఇన్స్టిట్యూట్‌లో తేదీ 21-3-59 న
ప్రప్రథమంగా ప్రదర్శించారు, ఆపరేటింగు
కల్చరల్ యూనిట్ వారు

అప్పటి నటీనట వర్గం :

| | | |
|---|---|---|
| వెంకటేశ్వర్లు | — | శ్రీ జి. జగన్నాథం |
| పురుషోత్తం | — | ,, బి. వి. రత్నం |
| గజపతి | — | ,, బి. వి. యల్, యస్. మూర్తి |
| శివం | — | ,, జి. మాధవరావు |
| రామం | — | ,, బి. వి. విశ్వేశ్వరరావు |
| సోమయాజులు | — | ,, డి. సదానందరావు |
| నరసయ్య | — | ,, డి. వి. అప్పారావు |
| చిన్నయ్య | — | ,, పి. వెంకటరావు |
| శాంత | — | కుమారి రాఘవకుమారి (రాజమండ్రి |

దర్శకత్వం : యమ్. హనుమంతరావు



# నిమిత్తమాత్రులు



## 1 వ దృశ్యం

[వెంకటేశ్వర్లు యింట్లో ఒకగది. గదిమధ్య సోఫా, దానికియిరు వైపుల రెండుకుర్చీలూ, సోఫాముందు ఓ చిన్న టీపాయ్. టీపాయ్‌మీద మడతపెట్టివున్న రెండు మూడు దినపత్రికలు చిందరవందరగా పడి వుంటాయి. ప్రేక్షకులకెదురుగా లోపలికి పోయేందుకు ద్వారంవుంటుంది వీధిలోంచి నౌకరు చిన్నయ్య ఒక పత్రిక చేతపట్టుకునివచ్చి దాన్ని టీపాయ్‌మీద పెడతాడు. అప్పుడే వెంకటేశ్వర్లు లోపల్నించి వస్తాడు. మనిషి అట్టే పొడుగూ కాదు....అంతగా పొట్టీకాదు. బొద్దు మీసాలూ, సిల్కులాల్చీ, గ్లాస్గో పంచెతో ఠీవిగా వుంటాడు.]

వెంకటేశ్వర్లు: (సోఫాలో కూచుని) ఈ వేళ పత్రిక వచ్చిందిరా?

చిన్నయ్య: (పత్రిక తీసియిచ్చి) ఇదిగోండి బాబయ్యా!
(వెంకటేశ్వర్లు కాస్సేపు పత్రిక చదువుతాడు)

చిన్న: (సవినయంగా) బాబూ!

వెం: ఏంరా?

చిన్న: సిన్న మనవి బాబూ!

వెం: ఏవిట్రా?

చిన్న: మా పిల్లకి యీ యేడు పెళ్ళిచేసెయ్యాలనుంది బాబయ్యా!

వెం: (పేపరుపైనుండి దృష్టి మరల్చుతూ) మంచిదే! నీ కూతురికి పెళ్ళిచేయాల్సిన బాధ్యత నీమీదుంది. ఆ విషయంకూడా నాకెందుకురా చెప్పడం?

చిన్న: అవుసరముంది గనకే సెప్తున్నానండీ!

వెం: ఏవిటీ, చెప్పు మరి-నీమనసులోవున్నది గ్రహించడం నా తరమా?

చిన్న: తమరు కొంచెం డబ్బు సాయంచెయ్యాలండీ!

వెం: అదా! దానికేంలేరా! ఈపాటి విషయానికే నువ్వింతగా సంశయించాలా? ఎవరైనాసరే, మనసులో వున్నది దాచకండా వెళ్ళగక్కితే నాకెంతో ఆనందంగా వుంటుంది. అవుతే, యెంత డబ్బు కావాలంటావు?

చిన్న: ఎంతో కాదండీ! ఓరెండొందలు సర్దినారంటే, చాలు, జీతంలో ప్రతినెలా కొంత కొట్టేసుకుందురుగాని!

వెం: అలాగేలే! ఎప్పుడు కావాలంటావు?

చిన్న: వారంరోజుల్లోపు యిస్తే, మీకు పుణ్యముంటుంది బాబూ!

వెం: రేపు అడిగి తీసుకువెళ్లు. సరేనా.

చిన్న: (సంతోషంతో) తమరు మామంచోరు బాబయ్యా! మీ దగ్గిర నౌకరీ సేస్తుండడం నా అదృష్టమే. (బైటికి నిష్క్రమిస్తాడు)

వెం: (పత్రికలోకి మళ్ళీ దృష్టిని పోనిచ్చి) ఎంత సంబరపడి పోతున్నాడు పిచ్చివాడు !

[శాంత లోపల్నుంచి ప్రవేశిస్తుంది. 18 యేళ్ళ వయస్సు. చక్కని విగ్రహం.]

శాంత: ఏమిటి నాన్నా! మీలో మీరే మాట్లాడుకుంటున్నారు ?

వెం:(పత్రిక పడేసి) ఏమీ లేదమ్మా! మన చిన్నయ్య కూతురికి పెళ్ళిచేస్తాడట. ఓ రెండువందలు సహాయం చెయ్యమంటున్నాడు.

శాం: (నవ్వి) రెండువందలతో పెళ్ళా నాన్నా !

వెం: వాళ్ళ బ్రతుకులే అంత శాంతా! గంతకుతగ్గ బొంత. ఏదో, పెళ్ళి అయ్యిందని అనిపించుకుంటారు. అంతటి తోనే తృప్తిపడతారు. లేకపోతే, వాళ్ళకి డబ్బు యెక్కణ్ణించి వస్తుంది చెప్పు ?

శాం: ఔను మరి! అవుతే, మీ రిస్తామన్నారా? ఇవ్వండి నాన్నా, పాపం! అప్పుచేసేందుకు భయపడి మిమ్మల్ని అడిగినట్టున్నాడు.

వెం: ఇస్తానన్నానమ్మా! ఎంత సంతోషించాడనుకున్నావు ఆమాటకే !

శాం: సంతోషం కాదా నాన్నా, మరి! ఒకటా, రెండా! రెండువందలు; ఎవరిస్తారు? యింతకంటె పేదవాళ్ళకి కావల్సిన సహాయం యేముంటుంది గనుక !

వెం : పోనీలేవమ్మా! మనకి భగవంతుడిచ్చాడు గాబట్టి, సహాయం చెయ్యగలుగుతున్నాం. అది మళ్ళీ మనకి తిరిగి వచ్చేస్తుంది కూడాను...నిజంగా చిన్నయ్య నాకంటె యెన్నోరెట్లు నయం...(నిట్టూరుస్తాడు)

శా : అదేవిటి నాన్నా, అలా అంటారు?

వెం : ఔనమ్మా! ప్రతీ తండ్రీ కొంత బాధ్యత కలిగి వుంటాడు. ఇంత పేదవాడైనా, చిన్నయ్య చూడు - కూతురికి పెళ్ళిచెయ్యడమన్న తనబాధ్యతని గుర్తించుకుని, నిర్వర్తించుకొంటున్నాడు. కాని యే విషయంలోనూ లోటులేని నేను మాత్రం యింకా ఆ భారాన్ని దింపుకోలేకపోతున్నానమ్మా!

శా : (చకితయై) మీకు నేను అంత భారమైపోయానా నాన్నా?

వెం : (నవ్వి) పిచ్చిపిల్లా! ఆడపిల్లకి యీడువచ్చిందగ్గర్నించీ తలిదండ్రులకు భారమేనమ్మా! ఆ భారాన్ని తప్పించుకున్నపుడే, ఆ బాధ్యతని సక్రమంగా నిర్వర్తించుకున్నపుడే తలిదండ్రులకు ఆనందం.

శా : మీరు నా విషయంలో యెందు కంతగా బాధపడ్డం నాన్నా? ఇప్పుడు నేను యేమంత పెద్దదాన్నయ్యానని? కల్యాణసమయం వచ్చినపుడే అవుతుంది లెద్దురూ!

వెం : అది నాకూ తెలుసునమ్మా! కాని, ఆ సమయం అనతికాలంలో వచ్చే సూచనలేవీ సుదూరంలో

అగుపించటం లేదు. పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా వున్నయ్. ఈ విషయంలో మీ అమ్మకీ, నాకూ రాజీ కుదరటంలేదు. ఏంచెయ్యాడమో, యేమీ అవగాహనకావటంలేదు. చివరికి పరిస్థితులు యెవరికి అనుకూలంగా వుంటాయో, చెప్పలేం కదా! (నిట్టూరుస్తాడు)

శాం : నేను చెప్పాను కదూ నాన్నా! మీ రాత్రే బాధపడకండి. అన్నట్టు మీరు బజారుకి వెళ్ళినపుడు, ఏవైనా వారపత్రికలు తీసుకురద్దురూ! ఏమీ వుబుసు పోకుండావుంది.

వెం : అన్నయ్యకు చెప్పలేకపోయావ్వూ ?

శాం : అన్నయ్యాధోరణే వేరు నాన్నా ! ఒకవేళ చెప్పినా, వట్టిచేతుల్తో తిరిగివచ్చి 'సారీ, మర్చిపోయా చెల్లీ' అనేస్తాడు తేలిగ్గా.

వెం : పోనీ, మీ మావయ్యకి చెప్పు; తీసుకొస్తాడు.

శాం : (అయిష్టంగా) ఎవరికీ చెప్పొద్దు. మీరు తీసుకురండి నాన్నా !

వెం : అలాగేలే అమ్మాయ్. అన్నట్టు, తీరికవున్నపుడు యీ దినపత్రికలుకూడా చూస్తూవుండమ్మా ! ప్రపంచవిషయాలు తెలుస్తూవుంటాయి.

శాం : (నవ్వుతూ) వంటగదిలో వుండే మాకు యెందుకు నాన్నా ప్రపంచవిషయాలు ?

వెం : కొద్దో గొప్పో చదువుకున్నావు. నువ్వూ అలాగే అంటావేవిటి శాంతా ! తెలుసుకోవాలమ్మా !

అందరమూ తెలుసుకోవాలి. అందువల్ల వుపయోగం యిప్పుడు లేకపోవచ్చు. కాని, ముందు ముందు వుపయోగించవొచ్చు. ఉపయోగించకపోయినా, కొన్ని విషయాలు తెలుస్తాయి కదమ్మా! (యేదో జ్ఞప్తికివచ్చి జేబుగడియారంతీసి టైం చూసుకుంటాడు) అప్పుడే పదిగంటలయ్యింది. నాకు రోజుకి రోజూ, మతిమరుపు విపరీతంగా పెరిగిపోతోందేవిఁటీ? చాలా అవసరంగా ఒక చోటుకి వెళ్లాలి. మీ అమ్మతో చెప్పేయ్. (చరచరా బైటికి పోతాడు)

[శాంత కుర్చీలోకూర్చుని పత్రికతీసి చూస్తుంది. బైట నుండి గజపతి వస్తాడు. మొహంలో కరకుదనం కొట్టవచ్చినట్లు అగుపిస్తుంది. వస్తూ చేతిలోవున్న సిగరెట్టు కిందపడేసి, బూటుతో నలిపేస్తాడు]

గజపతి : ఏవిఁటి శాంతా! ప్రపంచవార్తలు తెలుసుకోవాలన్న ఆసక్తి, యిటీవల నీక్కూడా కలుగుతున్నట్టుందే! అవుతే ప్రమాదమే.

శాం : (నిర్లక్ష్యంగా నిల్చుని) ఏవిఁటో ఆ ప్రమాదం?

గజ : ఏదైతే యేంలే! ఈ వార్తాపత్రిక బదులు, వారపత్రికలు తెప్పించుకుని, అందులోని ప్రమదావనం, వనితావాణీ, తీరిగ్గాకూచుని చదువుకో కూడదూ? అల్లికలూ, వంటలూ, వీలుంటే, ఆవకాయ పెట్టుకోవటం – వీటన్నిటిలో పాండిత్యం సంపాదించే దానివి!

శాం : (విసురుగా) నాకు చెప్పేవాడివి, నువ్వే నేర్చుకో కూడదూ ?

గజ : (చిన్నబుచ్చుకొని) నీ నోటికి అడ్డం అంటూ యేమీ వుండదని నాకు తెలుసుననుకో! అయినా, నీ మంచికై చెబుతూవుంటే, అలా విరుచుకుపడతావేం ?

శాం : (చిరుకోపంతో) ఎవరూ నీ సలహాకోసం యాచించలేదే !

గజ : ఎలాగైనా, నీకు నోటిదురుసు అధికం శాంతా! ఇప్పుడంటే—నీమీద అభిమానంవల్లనె తేనేం— వూరుకుంటున్నానుగాని, ఆ మూడు ముళ్ళూ పడ్డాక యీ సహనం వుండదేమో !

శాం : (నిర్లక్ష్యంగా) ఆ ముళ్ళేవో పడినప్పుడుమాటకదా !

గజ : ఇంకెన్నాళ్ళు ? ఆ సమయం కూడా దగ్గరపడుతోందిగా! మీ అమ్మకూడా అంటోంది, త్వరలోనే ముహూర్తం నిశ్చయించేట్టు చూస్తానని.

శాం : (అదోలా నవ్వి) నే నొప్పుకుంటేగా, ఆ నిశ్చయించడానికి విలువ వుంటుంది ?

గజ : (విస్తుపోయి) అదేవిటి శాంతా! ఈవేళ నీనోట కొత్తమాట వింటున్నాను ?

శాం : కొత్తేవిటి? ఇది నా పాత పాటే !

గజ : ఏం?ఎందుకొప్పుకోవూ? నాలో యేమిటిలోపం చెప్పు? చదువులేదా? సంస్కారంలేదా ? వయస్సు యేమంత

యెక్కువా ? ఇక, డబ్బువిషయం: నీకు తెలీనిదేమీ లేదు. రెండు మూడు తరాలవరకూ వుద్యోగాలు చెయ్యకపోయినా, హాయిగా జీవితాలు గడిపే యెచ్చు. ఇంక, కావల్సిందేవిఁటి ?

శాం : (నవ్వి) కూచుని తింటే, కొండలుకూడా హరించుకు పోతాయట.

గజ : అంటే, నీ వుద్దేశం నన్ను వుద్యోగం చెయ్యమంటావు. అంతేనా ? ఉద్యోగంవుంటే, వున్న ఆస్తి కరక్కుండా వుంటుందని నీ అభిమతం గామోసు ! అలా సూటిగా చెప్పేయకూడదూ ? ఉద్యోగం కావాలని నేను తలంచాలేగాని యీ క్షణంలో- నిమిషాలమీద దొరుకుతుంది.

శాం : (విసుగ్గా) అబ్బబ్బ ! నిన్ను వుద్యోగం చెయ్యమని యెవరు చెప్పారు మావఁయ్యా ? అసలు, నిన్ను పెళ్ళిచేసుకోవటం నాకు యిష్టంలేదు. అంతే!ఇప్పుడు తెలిసిందా ?

గజ : (తీక్ష్ణంగా ఆమె మొహంలోకి చూసి) కారణం ?

శాం : నాకు యిష్టంలేదు...అదే కారణం.

గజ : ఎందు కిష్టంలేదో చెప్పు మరి ?

శాం : అదంతా నీకు అనవసరం.

గజ : (వికటంగా నవ్వి) ఔను. ఇప్పు డనవసరమే ! నేను వూహించింది అక్షరాలా నిజమయ్యింది.

శాం : (నిస్తబ్ధతగా) ఏవిఁటి వూహించావు ?

గజ : ఏముంది ? నీ మనస్సు యేనాడో పరాధీన మయ్యిం దన్న నగ్నసత్యాన్ని యీనాటికి తెలుసుకున్నాను. దాని ఫలితమే యీ నిరాకరణ.

శాం : (ఉద్రేకం ఆపుకోలేక) నోటికొచ్చినట్టు వాగితే మంచి మాటకాదు మావయ్యా! నువ్వాగాబట్టి వూరు కున్నాను. ఇంకెవరన్నా అయితే పళ్ళు రాలేవి.
[బైటనుండి శివం వస్తాడు. స్ఫురద్రూపి. ఎప్పుడూ వుత్సాహంగా వుంటాడు.]

శివం : (వస్తూనే) ఏవిఁటి చెల్లాయ్! పళ్ళు రాల్తాయంటు న్నావు ?

శాం: (విసురుగా) మావఁయ్య మూతిపళ్ళు.

గజ : (కోపంగా) శాంతా !

శివం: ఏవిఁటి చెల్లాయ్ యిదంతా ?

శాం: మావఁయ్యనే అడుగు. (చరచరా లోపలికిపోతుంది)

శివం: ఏవిఁటి మావఁయ్యా ?

గజ : ఏవీఁలేదులేవోయ్...వూరికనే! అయినా మీ చెల్లికి నోటిదురుసు యెక్కువోయ్. అది తగ్గించుకోకపోతే వొంటికి మంచిదికాదు.

శివం: (నవ్వి) ఉన్నమాటంటే, యెదుటివారికి నోటిదురుసు లానే అనిపిస్తుందిలే! నన్నుకూడా చాలామంది అలాగే అంటుంటారు మావఁయ్యా! కాని, యేం చేస్తాం! అవన్నీ చెవినబెడితే అవుతుందా ? అరుచు కోనీ అని గమ్మున వూరుకుంటాను. ఇంతకీ, చెల్లాయి

యేవిషయంలో నోరుపారేసుకుంటావో, కాస్త చెప్ప రాదూ ?

గజ : (చెప్పడానికి యిష్టంలేక) . పెద్దవిషయాల్లో నువ్వు జోక్యంకలుగజేసుకోకూడదోయ్. చదువుకుంటున్న వాడివి ... ఆ ధ్యాసలోనే వుండాలిగాని, యివన్నీ నీ కెందుకూ ?

శివం : ఏ సీ! అంటే నీ అభిప్రాయం పెద్ద విషయాల్లో జోక్యం కలుగజేసుకొనేటంత వయసు లేదనా ? పోనీలే చెప్పకపోతే! నాకు తెలీకండా వుంటుందా యేవిటి? అన్నట్లు నీ వుద్యోగంసంగతి యేమయ్యింది మావయ్యా ?

గజ : ఇంకా ప్రయత్నిస్తూనే వున్నానోయ్. ఇదిగో, అదిగో అంటారేగాని, యేదీ తేల్చరు. అవుతే, ఒక విష యంలే, వున్నమాట చెప్పొద్దూ !

శివం : ఏవిటది ?

గజ : మామూలు గుమాస్తాగిరిలాంటివి యిప్పుడంటే యిప్పుడు దొరుకుతాయి. కాని, ఆ వెధవ వుద్యోగం చెయ్యటం నాకు యిష్టంలేదు.

శివం : అవుతే నువ్వుప్రయత్నిస్తూంది మరే వుద్యోగంకోసం?

గజ : (విసుగ్గా) అదంతా నీ కెందుకులేవోయ్...

శివం: ఔనౌను. అంతే ! అవన్నీ పెద్దపెద్ద విషయాలు. జోక్యం కలుగజేసుకునే అర్హత నాకులేదు. సరేగాని ఆ వుద్యోగమేదో దొరికేవరకూ, నువ్వు యిక్కడే వుంటావా మావయ్యా ?

గజ : (తెల్లబోయి) ఏమిటీ! అంటే నేను మీ యింట్లో వుండటం నీకు యిష్టంలేదన్నమాట. ఎంత నిరోత్సాహ మాటంగా అనేశావోయ్! మీకు యిష్టంలేక పోయినా, 'దేహీ' అని మీయింట్లో పడివుండేందుకు నేనింకా ఆ స్థాయికి దిగజారిపోలేదు శివం! నా ఖర్మ కాలి వుద్యోగప్రయత్నాలకోసం వచ్చాను గాని, లేకపోతే వచ్చేవాణ్ణా? ఎంత అవమానం! ఎందుకూ, మీ అమ్మనే అడిగి, యే హోటల్లోనో మకాంపెడతా నుండు. (వెళ్ళిపోబోతాడు)

శివం : (ఆపి) అబ్బ! అలా అపార్థంచేసుకుంటే, యెట్లా మావయ్యా! నే నెందు కలా అడిగానో, శాస్త్ర తార్కికంగా ఆలోచించావూ ?

గజ : (ఆగి) ఎందు కడిగావు ?

శివం : నువ్వు మీవూరు వెళ్ళినపుడు నీతో నేనుకూడా వద్దామనుకుంటున్నాను.

గజ : ఓ! అదా సంగతి! నువ్వొన్నావే అసాధ్యుడవోయ్! సూటిగా యేవిషయాన్నీ చెప్పవు. ఆ డొంకతిరుగుడు మాటలు అర్థంచేసుకుందుకు తల ప్రాణం తోకకి వస్తుందంటే నమ్ము. సరేగాని, త్వరలోనే వెళ్ళాం లేవోయ్. అయినా వుద్యోగానికీ, మన ప్రయాణా నికీ సంబంధం యేమిటోయ్? చెప్పాకోవాలంటే, అసలు నాకు వుద్యోగంచెయ్యాలన్న వుత్సాహం గానీ, అవసరంగానీ లేదు. అవుతే, 'వుద్యోగం పురుష

లక్షణం' అన్నారు గనుక ఆ సూత్రాన్ని కాస్త పాటించొద్దూ ?

శివం : ఔను. అంతేలే! అవుతే యెప్పుడు వెళ్దామంటావు ?

గజ : అది నీయిష్టం. నువ్వెప్పుడు 'ఘ్రాం'అంటే అప్పుడే ! నేనూ సిద్ధంగానే వున్నాను. అన్నట్టు నువ్వెలాగో బయల్దేరుతున్నావు కదా, మీ చెల్లాయినికూడా నీతో తీసుకురాకూడదూ ?

శివం : ఊహూ ! అది మాత్రం నాచేతకాదు మావయ్యా ! ఈ మాట చెల్లాయితో చెప్పానంటే, నామీద బుసలుకొడుతుంది. అయినా సరే ప్రయత్నిస్తాను.

గజ : (శివంభుజం తట్టి) అదీ! అలా ముందుకిరావాలోయ్. మీ యిద్దరూ మాయింటికి వచ్చారంటే మా అమ్మ యెంతగా మురిసిపోతుందనుకున్నావు? మరి-ప్రయాణ సన్నాహాలు చేస్తావుకదూ ?

శివం : ఓ ! అలాగే !

[గజపతి మందహాసంచేస్తూ లోపలికి పోతాడు. శివం అక్కడేవున్న పత్రిక తీసుకుని తిరగేస్తుంటాడు]

శాం : (లోపల్నుంచి వస్తూ) చిన్నయ్యా! చిన్నయ్యా !

శివం : ఏడీ ? ఎక్కడున్నాడు చిన్నయ్య ?

శాం : (వినుగ్గా) వీడొహడూ, ఎక్కడకి పోతాడో యేమిటో! (లోపలికి పోబోతుంది)

శివం : చెల్లాయ్ ... మాట ... (పత్రిక టీపాయిమీద పడేస్తాడు.)

శాం : (ఆగి) ఏమిటన్నయ్యా ?

శివం : మావయ్యకి, నీకూ యేమిటా తగాదా ?
శాం : మావయ్య చెప్పలేదూ ?
శివం : అబ్బే ! కదిలించి చూశాను, గాని—లాభం లేక పోయింది.
శాం : (చిరుకోపంతో) ఏమోహంపెట్టుకు చెప్తాడులే !
శివం : (నవ్వి) ఏం ? తన మొహం పెట్టుకు చెప్పలేడా యేమిటి ?
శాం : అబ్బ! నీ కెప్పుడూ పరిహాసమే నన్నయ్యా !
శివం : పోనీ సీరియస్‌గా వుంటాను చెప్పు. ఏంజరిగింది?
శాం : నీతో అసలు యేమీ చెప్పలేదా ?
శివం : ఒక్కటి మాత్రం అన్నాడు.
శాం : ఏమిటి ?
శివం : నీకు నోటిదురుసు యెక్కువని...
శాం : (చిరుకోపంతో) తన బుర్రతిరుగుడుకంటేనా ?
శివం : ఏమన్నా అన్నాడా యేమిటి ?
శాం : అవన్నీ నీతో చెప్పడం యెందుగ్గానీ, నీకు తెలీదా యేమిటి అమ్మ ప్రయత్నం ?
శివం : అబ్బే ! నా కేమీ తెలీదు. ఏమిటా ప్రయత్నం?
శాం : తో బుట్టువుమీదుండే 'తరగని అభిమానంతో, బాంధవ్యం మరింత బలపర్చాలని, ప్రయత్నిస్తోం దన్నయ్యా ! (నిట్టూరుస్తుంది.)
శివం : ఏమిటో నాకు అర్థంకావడంలేదు.
శాం : ఔనులే ! ఇల్లాంటివి నీ కెట్లా అర్థమౌతాయి ?
శివం : చెప్పదల్చుకున్న దేదో సూటిగా చెప్పకూడదూ ?

శాం : (దిగులుగా) అమ్మ నన్ను మావయ్యకిచ్చి పెళ్ళి చెయ్యాలని చూస్తున్న దన్నయ్యా !

శివం : వాట్ ! మావయ్యకీ నీకూ పెళ్ళా ! ఏమిటీ అన్యాయం? ఎందుకీ దౌర్జన్యం. మావయ్య వయస్సెంత నీ వయస్సెంత ? అదీగాక, అతనికి మొదటిభార్య పోయిందే ! మరో గత్యంతరంలేనట్టుగా, అల్లాంటి వాడికా కట్టబెట్టాలని చూస్తుంది ? ఎంతఘోరం ! ఇంతకీ మావయ్య యేమంటాడు ?

శాం: (బాధగా నవ్వి) ఏమంటాడూ? అకస్మాత్తుగా అమృత భాండం అయాచితంగా లభిస్తూవుంటే, చేతులారా జారవిడుచుకునే మూర్ఖులెవ రన్నయ్యా?అసలు యీ ప్లానుకూడా అతను వేసిందేనేమోనని నా అనుమానం. అప్పుడే, పరిహాసాలాడ్డంకూడా ప్రారంభించాడు.

శివం : అదా సంగతి ! మీ తగూకి కారణం యిప్పుడు తెలిసింది. హూఁ...నిన్ను మావయ్య యెలా పెళ్ళాడతాడో చూస్తానుగా !

శాం : (నవ్వి) ఏం చేస్తావన్నయ్యా? అమ్మయెదుట మాట్లాడ్డానికే నీకు భయంకదా, యింక నువ్వు యెదిరించేదేమిటి ?

శివం : నాన్నతో చెప్తాను. ఈ వివాహం కాకుండా చూస్తాను.

శాం : నాన్నకి తెలుసు నన్నయ్యా ! అయినాసరే యింత వరకు యేమీ తొణకలేదు.

శివం : (దిగాలుపడి) తెలుసునూ! అవుతే యేంచేద్దాం?

శాం : (నవ్వి) ఇంత వుత్సాహామూ, వు(దేకమూ, పట్టుదలా, అన్నీ సడలిపోయాయూ అన్నయ్యా?

శివం : అనవసరంగా తగూలెందుకని చూస్తున్నాను గానీ లేకపోతే యెదిరించేవాణ్ణే. (క్షణం ఆగి) అన్నట్టు, నాన్న నిన్ను రామంబావ కిచ్చి పెళ్లిచేస్తానని అంటుండేవారు కదూ ఆమధ్య.

శాం : ఔను, అప్పట్లో ఆమాట అంటుండేవారు. కాని, యిటీవల మావయ్యభార్య పోవటం, అమ్మ అటు మొగ్గుచూపటం పరిస్థితుల్ని తల్ల(కిందులు చేశాయి.

శివం : అవుతే ఒకలా చేస్తే బావుంటుందేమో?

శాం : ఏమిటన్నయ్యా?

శివం : మెల్లగా మంచి మాటలతో, మావయ్య మనసే మార్చడానికి (ప్రయత్నిస్తే. యీ సమస్య దానంతటదే పరిష్కారమౌతుందేమో?

శాం : ఔ నన్నయ్యా! నీ ఆలోచన బావుంది. పోనీ, ఆ (ప్రయత్నమన్నా చెయ్యి. పీడావదుల్తుంది. (బాధగా) భావిజీవితమ్మీద యెన్నో ఆశలుపెట్టుకుని వున్నాను. ఎన్నో సుందరస్వప్నాలు కంటున్నాను. నా ఆశలన్నీ అణగార్చుకుని, కలలన్నీ కల్లలనుకుని, చివరికి యీ మావయ్యను పెళ్ళిచేసుకోవాలి ...! (దుఃఖంతో) అంతకంటె...

శివం : (అందుకుని) బాధపడకు చెల్లాయ్. చూస్తూ చూస్తూ నాన్న చేతులారా నీ జీవితం నాశనం చెయ్యరు.

అమ్మ పైకి యెన్ని చెప్పుకున్నా, యెన్ని ప్రయత్నాలు చేసినా, నాన్న గంభీరంగా వుంటున్నారు. అంటే ఆయన యేదో పరిష్కారమార్గం ఆలోచిస్తున్నారన్న మాటేగా! నువ్వేమీ అధైర్యపడకు. (బయట జోడు చప్పుడు విని) నాన్నగారే గామోసు వస్తున్నారు. ఇక్కడున్నానంటే తియ్యని తిట్లు తప్పవు. అబ్బబ్బ! ఈ విద్యార్థిదశ యెప్పుడు దాటుతుందో గాని, యీ అదుపుబ్రతుకు యీడ్చలేక చస్తున్నాను (మెల్లగా లోపలికి జారుకుంటాడు)

[వెంకటేశ్వర్లు ప్రవేశిస్తాడు. అతనిచేతిలో రెండు వారపత్రికలు వుంటాయి]

వెంక : (వస్తూనే) ఇంత శ్రమతీసుకుని వెళ్ళినపని జయం కాలేదమ్మాయి....ఇదిగో నువ్వు పుస్తకాలు తెచ్చి పెట్టమన్నావు కదూ. (యిస్తాడు) వచ్చేవారంనుంచి మనింటికే తెచ్చి యిస్తుంటాడులే! నీకు యేం కావాలన్నా. బిడియపడకండా, భయపడకండా చెప్పమ్మాయ్. మనకి డబ్బు వుందంటే, దాన్ని సాధ్యమైనంతవరకు వుదాత్తమైన ప్రయోజనానికే వినియోగించడానికి ప్రయత్నిద్దాం. అన్నట్టు నాకోసం యెవరన్నా వచ్చారా?

శాం : లేదు నాన్నా!

వెంక : శివం యేడీ? ఇవ్వాళ కాలేజీకి శలవుకదా, వెధవకి చదువుకోవటం తెలీదూ?

శాం : (నవ్వును ఆపుకుంటూ) లోపల చదువుకుంటున్నాడు నాన్నా !

వెంక : వెధవ ! ఇప్పుడిప్పుడు మార్గానపడుతున్నాడులే ! పడక యేంజేస్తాడు? బాధ్యత తెలుస్తోందిగా! అన్నట్టు, చెప్పడం మరిచాను. రామం కలిశాడమ్మాయ్... (కూతురు మొహంలోనికి చూస్తాడు)

శాం : (ఉత్సాహంగా) ఊర్నించి వచ్చేశాడేవిటి నాన్నా !

వెం : ఔనమ్మా ! మనింటికి ఓసారి రమ్మన్నాను. వాణ్ణి చూస్తుంటే, నాకు మహా చెడ్డజాలేస్తుందమ్మాయ్. ఇంకా వుద్యోగం దొరక్కపోవడం, వాడి ఖర్మగాక పోతే, యిప్పుడీ వుద్యోగాలు సంపాదించిన వాళ్ళంతా వాడికంటె తెలివైనవాళ్ళా ? చురుకైన వాళ్ళా ? ఊహూఁ...కాదు. ఇదంతా వాడి దురదృష్టం.

శాం : పోనీ, మీరు యెవరితోనన్నా చెప్పి వుద్యోగం వేయించలేరా నాన్నా ?

వెం : (చిన్నగా నవ్వి) వాడంటే నీకు ఆపాటి అభిమానం, ఆత్మీయతా వుండటంలో ఆశ్చర్యమేమీ లేదులే ! ఆ అభిమానమేవిటో నాకూ తెలుసు. కాని, నాకు వాడంటే మరీ ప్రాణం. స్వయానా చెల్లెలికొడుకు. మీ అత్తయ్య యీ లోకంవిడిచిపోయినా, ఆ బంధుత్వమూ, రక్తసంబంధమూ యెక్కడికిపోతాయి చెప్పు ? రామంకి యెన్నోసార్లు చెప్పాను నాతో ఒకసారి రమ్మని. కాని, వాడు వస్తేనా? ఒకరి సిఫార్సు

వల్ల వుద్యోగం సంపాదించడం యిష్టంలేదంటాడు. ఏంచెయ్యను మరి? అసలు—వాడు యిప్పుడేకాదమ్మా మొదట్నుంచీ అభిమానస్తుడే!

(బైట 'వెంకటేశ్వర్లుగారూ?' అని పిలుపు)

వెం: ఎవరో వచ్చారు ఈ చిన్నయ్య యెక్కడికిపోయాడో యేవిటో! వెధవ! ఒరేయ్ చిన్నయ్యా!

(శాంత లోపలికి పోతుంది)

చిన్న: (ఆవులించుతూ వస్తూ) పిల్చారా బాబూ?

వెం: ఎక్కడ తగలడ్డావురా? ఎవరో బయట పిలుస్తున్నారు కదా, అక్కడే వుండి యేం చేస్తున్నావు?

చిన్న: కూకుంటే, సిన్న కునుకుపట్టేసిందండీ!

వెం: ఏడిశావు! వెళ్ళి ఆయన్ని లోపలికి పంపించు.

చిన్న: చిత్తం (బైటికి పోతాడు)

[ముప్ఫైరెండేళ్లకు పైబడిన వ్యక్తి ప్రవేశిస్తాడు. కండలు తిరిగిన విగ్రహం – కొనదేరిన మీసాలూ – ఉంగరాల జుత్తు – పంచె, కళ్ళీ లాల్చీ – యిదీ అతని వేషం]

నరసయ్య: నమస్కారమండీ వెంకటేశ్వర్లుగారూ!

వెం: (పరకాయించి చూస్తూ) ఎవరూ!

నర: నేనండీ! నరసయ్యను. నా పేరు వినేవుండాలి.

వెం: లేదు. వినలేదు. ఇంతకీ నా పేరు యెలా తెలిసింది? అన్నట్టు, మాటలసందడిలో మర్చిపోయాను... కూచోండి. (నరసయ్య కూచుంటాడు)

నర : మంచిమాటేనండీ ! మాలాంటి సామాన్యులపేర్లంటే మీకు తెలీకపోవొచ్చునుగాని, మీలాంటి గొప్ప వారిపేర్లు తెలీకపోవడమేవిఁటి చెప్పండి ?

వెం : (పొగడ్త యిష్టంలేక) ఇంతకీ మీరు వచ్చిన పనేవిఁటి చెప్పండి.

నర : అదే చెప్పాలనుకుంటున్నానండీ ! మీ యింట్లో గజపతి అనే ఆయన వున్నాడు కదండీ !

వెం : ఔను. వున్నాడు...ఏం ?

నర : అతను మీ అబ్బాయా ?

వెం : అబ్బె ! కాదు...బావమర్ది.

నర : అలా చెప్పండి! మొదటే అనుకున్నాను, అతను మీ అబ్బాయి అయివుండడని.

వెం : అంటే, యేవిఁటి మీ వుద్దేశం ?

నర : మీ అబ్బాయి అంతగా దిగజారిపోతాడంటే నాకు నమ్మకం చాలిందికాదు. ఎంతయినా సింహాపుపిల్ల సింహమేనండీ !

వెం : (విసుగ్గా) ఏవిఁటో, మీ మాటలు నాకేమీ అర్థం కావటంలేదు.

నర : చూడండీ. ఆ గజపతిగారిబుద్ధి యెలా గడ్డితిన్నదో ! మా యింటిప్రక్కన దిక్కు మొక్కూ లేని ఓ తల్లీ, కూతురూ వున్నారులెండి. ఆ అమ్మాయికి డబ్బు యెరగా చూపించి యేమో అన్నారట.

వెం : (షాక్ తిని) మా గజపతా ?

నర : నిజమండీ! నామాట నమ్మండి. ఆ అమ్మాయి చాలా మంచిదిలెండి...వట్టి అమాయకురాలు. ఏడ్చుకుంటూ యీ విషయం వాళ్ళమ్మతో చెప్పిందట. వాళ్ళమ్మ నాతో చెప్పింది. చివరికి పేరుకూడా చెప్పి హోదా కోసం గామోసు – ఫలానా యింట్లో వుంటున్నానని కూడా చెప్పారట ఆయన. అతణ్ణి ఓమారు పిలిపించండి, కావాలంటే రుజువిప్పిస్తాను. అతను అయిపోయాడుగాని, యింకొకరైతే, యీసరికి ముక్కలు విరిగిపోయేవి. ఇవేం పాడుబుద్ధులండీ! ఏదీ అతణ్ణి ఓసారి పిలిపిస్తారూ?

వెం : (తడబడి) ఎందుకులెండి! ఏదో తెలీక పొరపాటు చేశాడేమో! ప్రస్తుతం మీ యెదుటికి రప్పిస్తే, రసాభాస అవుతుంది. ఉద్రేకంకొద్దీ మనిషోమాట అనుకుంటారు. మాటలు పెరుగుతాయి. చేతులు కలపడంకూడా జరగవచ్చు. ఎందుకీ లేనిపోనిగొడవ? ఇప్పటికి మీరు వెళ్ళండి. అతణ్ణి నేను కూకలేస్తాను.

నర : బుద్ధిచెప్పండి. ఈ నరసయ్యతడాఖా యింకా అతనికి తెలీదుగామోసు. [మీసం మెలివేసి] తెలుసుకోవాలంటే, ఘ్రాళ్ళో అడగమనండి.

వెం : సరేలెండి. అలాగే బుద్ధిచెప్తాను.

నర : మరి, నాకు శెలవిప్పిస్తారా?

వెం : మంచిది వెళ్ళండి.

నర : (లేచి వెళ్తూ మళ్ళీ తిరిగివచ్చి) ఏదీ, ఓ సిగరెట్ వుంటే యిప్పించండి!

వెం : నేను సిగరెట్లు కాల్చనండీ? పొడుంపీలుస్తారా ?

నర : అబ్బే! వద్దులెండి. (నిరుత్సాహంతో నిష్క్రమిస్తాడు)

వెం : చిన్నయ్యా ! ఒరేయ్ చిన్నయ్యా !

చిన్న: (వస్తూ) బాబూ !

వెం : గజపతిబాబుని పిలవరా!

చిన్న: చిత్తం....(లోపలికి పోతాడు)

(వెంకటేశ్వర్లు కోపంతో యిటూ అటూ పచార్లుచేస్తుంటాడు. క్షణంలో గజపతి వస్తాడు)

గజ : పిల్చారా బావా?

వెం : (చిరుకోపంతో) ఆఁ, పిల్చాను. నువ్వు యీవూరు యెందుకొచ్చినట్టోయ్ ?

గజ : (గతుక్కుమని) అదేంప్రశ్న బావా? ఎందుకు రావడమేమిటీ? ఒకటీ, మీరున్నారని—కాదు — మా అక్కయ్య వుందని. రెండూ, వుద్యోగంకోసం ప్రయత్నించాలని.

వెం : మరి, యీ వేషాలేమిటి?

గజ : (నివ్వెరపోయి) వేషాలా ! ఏం వేషాలు?

వెం : ఎవరో అమ్మాయికి, డబ్బు యెరగా చూపించి యేమోఅన్నావట, నరసయ్య అనే ఆయన వచ్చి వుగ్రుడైపోయాడు. అయినా, యిల్లాంటి చిల్లర పను లేవిటోయ్? మా యింటా వంటా లేవు. నీలాంటి వుత్తముడికేనా, మా అమ్మాయిని ముడిపెడతానంటుంది మీఅక్క. చూడవోయ్-మళ్ళీ ఆ అమ్మాయి జోలికి వెళ్ళావంటే దుమ్ము లేపేస్తానంటున్నా డా

నరసయ్య. నీబాధ యెలావున్నా, 'ఫలానావారి బావ మర్ది' అని అంతా చెప్పుకుంటారు. నీకు పుణ్యముంటుంది.... నా పరువుతీయకు.

గజ : (తొణక్కుండా) ఏమిటి! ఎవరో అమ్మాయిని యేవిటో అన్నానా! ఎవ రలా చెప్పింది? నాకేవీఁ తెలీదు బావా. అతను వచ్చినప్పుడు నన్ను పిలవలేక పోయారా? అతడికే తగిన బుద్ధిచెప్పి పంపేవాణ్ణి? నన్ను ఓ జులాయి మనిషి క్రింద జమకడుతున్నాడా యేమిటి? హూఁ!

వెం : ఏది నిజమో అనగాహనకాకుండా వుంది. సరేగాని నీ వుద్యోగంసంగతి యేమయ్యిందోయ్?

గజ : ప్రయత్నిస్తున్నాను బావా! అదిగో, యిదిగో అంటారేగాని, యేదీ నిశ్చయంగా తేల్చరు. నాకే విసుగనిపిస్తోంది.

వెం : పోనీ, వున్నన్నాళ్ళయినా, నా గౌరవం కాస్త కాపాడవోయ్...తలవంపు తీసుకురాకు.

గజ : అబ్బే! నే నేమీ యెరుగనండీ! నిజంచెప్తున్నా. నామీద నమ్మకం కలగడంలేదేవిఁటి మీకు? అతనెవరో పొరపడివుంటాడు.

వెం : ఏదో జరిగిందిలే. ఇకనైనా బుద్ధిగావుండు.

[గజపతి విసురుగా బైటికి పోతాడు. వెంకటేశ్వర్లు పత్రికతీసి సోఫాలో కూచుని చదివే ప్రయత్నంలో వుంటాడు. పురుషోత్తం 45 యేళ్ళ వ్యక్తి ప్రవేశం]

వెం : (పత్రిక పడేసి) నువ్వా బావా! రా...కూర్చో.

పురు : (కూచుని) బావా! అమ్మాయికి అస్వస్థతగావుందని వుత్తరం వచ్చింది. ఓసారి చూసిరావా లనుకుంటు న్నాను.

వెం : ఏమిటా అస్వస్థత? వివరాలు రాశారా?

పురు: లేదు బావా; అదే నాకూ ఆతృతగావుంది. ఇప్పుడు దానికి తల్లీ, తండ్రీ నేనేకదా.

వెం : ఔను. తప్పకుండా వెళ్ళిరా.

పురు: వంటమనిషి రెండురోజులై రావడంలేదు. నేనే యెలాగో తంటాలుపడి ఈ రెండురోజులూ వంట చేశాను.

వెం : (అందుకుని) నాకు తెలీకడుగుతాను బావా, వంట మనిషి రాకపోతే ఈ రెండురోజులూ యిక్కడికి వచ్చేయలేకపోయూరా? ఇందులో పరాయివాళ్ళె వరు? ఛ! ఛా! యిదేమీ బాగులేదు. పోనీ, నువ్వి ప్పుడు వూరికి వెళ్తానంటున్నావు. వాణ్ణయినా యిక్క డికి పంపిస్తావా?

పురు : ఆ మాట చెప్పడానికే వచ్చాను బావా! హోటల్లో తింటే వాడి ఆరోగ్యం దెబ్బతింటుంది. అసలే వాడు వుద్యోగంలేక మతి పోగొట్టుకుంటున్నాడు. ఒంటరిగా యింట్లోవుంటే మరీ దిగులుపడిపోతాడు.

వెం : పీడితరహా నాకేమీా నచ్చలేదు బావా. వాడికి ఎన్నో సార్లు చెప్పాను, నాతో ఓమాటు రమ్మని. నాకు పరి చయమున్న ఆఫీసరొకాయన వున్నాడని చెప్పాను కదూ! అతనిదగ్గరికి తీసుకెళ్ళి చెప్పాలనుకున్నాను.

అతను సహాయంచేస్తాడన్న నమ్మకం నాకుంది. కాని, వీడు వాస్తేనా? ఒకరి సిఫార్సుతో వుద్యోగం సంపాదించటం యిష్టంలేదంటాడు. చూడు – వాడి అభిమానం! ఈరోజుల్లో యిలా మడిగట్టుక్కూర్చుంటే జరుగుతాయా వ్యవహారాలు ? ఏయెండకి ఆగొడుకు పట్టాలిగాని !

పురు : (నిట్టూర్చి) అది, నా దురదృష్టం బావా ! పిల్లల్ని యెంత గారాబంగా పెంచానో నీకు తెలీంది కాదు. అందుకే వాణ్ణి యేమీ అనలేకపోతున్నాను. వాడు యే విషయంలోనూ బాధపడ్డం నేను చూళ్ళేను.

వెం : సరేలే బావా ! అవన్నీ ఇప్పుడెందుకులే! వాణ్ణి తప్పకుండా యిక్కడికి పంపించెయ్. నేను చెప్పానని కూడా చెప్పు.

పురు : మరి నే వస్తాను బావా! (లేవబోతాడు)

వెం : వుండవోయ్, కాస్త కాఫీతాగి పోదువుగాని; అమ్మాయ్, శాంతా !

శాం : (లోపల్నుంచి వస్తూ) ఏం నాన్నా ? (పురుషోత్తంని చూచి) మావయ్య కూడా యిక్కడే వున్నారే ! ఎంతసేపయింది వచ్చి ?

పురు : ఇప్పుడే వచ్చానమ్మా !

వెం : అమ్మాయి, మావయ్యకి కాఫీ పట్రా.

పురు : ఇప్పుడెందుకులే బావా !

శాం : అలాగంటేకాదు మావయ్యా ! వుండండి తెస్తాను. (లోపలికి పోతుంది)

వెం : (నవ్వి) పిచ్చిపిల్ల! ఎంత చురుకైన దనుకున్నావు? దాన్ని ఒక యింటిదానిగా చేసి, నా బాధ్యత తీర్చుకోవాలనుకుంటూవుంటే, వీలుపడకండా వుంది బావా!

పురు : (అదోలానవ్వి) నీలాంటివాడివే అలా అంటే, యింకేవిటి? నీకేంలోటు? డబ్బులోటా? పరపతి తక్కువా? నీ అల్లుడు కావడానికి యెవరన్నా గంతువేసుకుని ముందుకు రారూ?

వెం : అది నాకూ తెలుసునోయ్. కాని, ఆటంకం అక్కడ లేదు. వేరే విషయాలున్నాయి.

పురు : వేరే విషయాలా!

వెం : ఔను, అవన్నీ తర్వాత తీరిగ్గా చెప్తాలే!
[శాంత రెండు కప్పుల కాఫీ తెచ్చి చెరోకప్పు యిస్తుంది.]

పురు : (కాఫీతాగి) శాంతా! పద్మకి వంట్లో బాగులేదటమ్మా! అక్కడికి వెళ్తున్నాను.

శాం : అలాగా మావయ్యా! పాపం పద్మ కెప్పుడూ యేదో ఒక కష్టం వుండనే వుంటోంది.

పురు : అదంతా నా దురదృష్టమమ్మా! వస్తా బావా, వస్తానమ్మా మరి – (లేచి భారంగా అడుగులువేసుకుని బైటికి పోతాడు)

శాం : ఈ వయస్సులో మావయ్యకి అన్నీ మనోవ్యధలే పట్టుకున్నాయి నాన్నా పాపం!

వెం : కొందరి జీవితాలే అంత శాంతా ! వారిపై సానుభూతి చూపించటం తప్పిస్తే, మనం మరేమీ చెయ్యలేం. అన్నట్టు, యీ రెండుగోజులూ రామాన్ని యిక్కడికే వచ్చేయమన్నానమ్మా !

శాం : మంచిపని చేశారు నాన్నా ! (పొరపాటు చేసినట్టుగా నాలుక కరచుకుని, వుత్సాహంగా ఖాళీకప్పులు తీసుకుని పోతుంది లోపలికి)

వెం : (నవ్వుకుని) రామం వస్తాడనగానే ఎంత వుత్సాహం పుట్టుకొచ్చింది పిచ్చితల్లికి ! దాని భవిష్యత్తు యెలా వుంటుందో యేమిటో ! (పత్రికతీసి) ఈవేళ పత్రిక చదవటం కాకండావుందే ! ఇక్కడవుంటే, యిక లాభంలేదు. (పత్రిక పట్టుకొని లోపలికి పోతూ వుండగా)

[తెరపడుతుంది]

# నిమిత్తమాత్రులు

## 2 వ దృశ్యం

[పురుషోత్తం యింట్లో ఒక గది. గదిలో ఒక టేబిలు, టేబిలుకు మూడువేపుల మూడు కుర్చీలు వుటాయి. టేబులుమీద యేవో పుస్తకాలు చిందరవందరగా పడివుంటాయి రామం కుర్చీలో కూచుని దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటాడు, క్షణంపోయాక లేచి, సాలోచనగా పచారు చేస్తూంటాడు,]

పురు : (బైటనుంచివస్తూ) ఏమిట్రా రామం, అలా ఆలోచనలతో సతమతమౌతున్నావు? ఆలోచనలు అట్టేపెట్టుకోకురా అని యెన్నోసార్లు చెప్పాను. అది ఆరోగ్యానికి మరింత భంగకరం. అంతులేని ఆలోచనచేసినందువల్ల ఒరిగే లాభంకూడా యేమీలేదుగా! అన్నట్లు నేను పద్మదగ్గరికి యిప్పుడే బయల్దేరుతున్నాను. మీ మావయ్యతో చెప్పడానికి వెళ్తే-తనే అన్నాడు, నిన్ను అక్కడికి పంపేయమని.

రామం : నేను అక్కడికి వెళ్ళను నాన్నా! చేతనైనట్టు వంట చేసుకొంటాన్లెద్దురూ!

పురు : నువ్వేనాడైనా వండి యెరుగుదువురా ?

రా : పోనీ, హోటల్లో తింటాన్లెండి.

పురు : బావుండదురా అబ్బాయ్ ! మీ మావయ్యే స్వయంగా చెప్పాడు. పరాయివాడేం కాదు. స్వయాన నీకు మేనమామ. ఆయన మాట అంత సులువుగా కొట్టిపారేయలేం. నా మాట విని, యీ రెండురోజులూ అక్కడే వుండు.

రా : మావయ్య మనవాడే నాన్నా ! కాని, అత్తయ్య విషయం కాస్త ఆలోచించండి; నన్ను చూస్తేనే ఆమె మూతి ముప్పయిమూడు విరుపులు విరుస్తుంది. అందుకే, అక్కడికి వెళ్ళడం నా కిష్టంలేదు.

పురు : చూడరా అబ్బాయ్, మనం ప్రతివిషయానికీ అభిమాన పడ్డం యేమంత శ్రేయస్కరం కాదు. రక్తసంబంధం వున్నవాళ్ళే, సన్నిహితులే ఒక్కోసమయాల్లో ఒకర్ని చూసి ఒకరు అసహ్యించుకొంటారు. ఇక పరాయి వాళ్ళ విషయం వేరే చెప్పాలా ? అవన్నీ మనం పట్టించుకుంటే, యేమీ సాధించలేం. జీవితంలో ముఖ్యంగా కావల్సింది నటన. కొంత నటన ప్రదర్శిస్తేనేగాని, సక్రమంగా సాగ దీ జీవితం.

రా : అది మాత్రం నాకుచేతకాదు నాన్నా! నటించాల్సిన అవసరం నా కేమీ అగుపించటంలేదు. ఏమిటో, ఆవిణ్ణిచూస్తేనే నాకు అసహ్యమేస్తుంది. అందులోనూ ప్రస్తుతం వాళ్ళ తమ్ముడు గజపతికూడా ఆ యింట్లోనే వుంటున్నాడు. వీళ్ళిద్దరూ యేనూటికిపోటి మాటలా

డినా, మనసు కష్టపెట్టుకోవాల్సివస్తుంది. ఎందు కీ గొడవ చెప్పండి? ఈ రెండురోజులూ నేను యెలాగో గడుపుకుంటానెద్దుగూ !

పురు : (ప్రోత్సాహితగా) నీమాట నీదేనేవిట్రా! పెద్దవాణ్ని యెందుకు చెప్తున్నానో కాస్తఆలోచించు. మీఅమ్మ బ్రతికివుంటే, నువ్విలా కొట్టిపారేసేవాడివా ? ఈ బంధుత్వాలూ, అనుబంధాలూ ఒకంతట పోయేవిగావురా! బ్రతికి వున్నంతకాలం వుంటాయి.

రా : ఏవిటో నాన్నా ! మీ రలా అంటారు. చూస్తే, నాకు అక్కడికి పోయేందుకు మనసు ఒప్పడంలేదు. మీమాట కాదంటే, మీకు కష్టంగావుంటుంది, లేక పోతే నాకుకష్టం....సరే మీయిష్టమే కానీయండి నాన్నా !

పు : నువ్విలా బలవంతంగా ఒప్పుకోవడం నా అభీష్టం కాదురా! మీఅమ్మ చనిపోయాక, మిమ్మల్ని యెలా పెంచుకొచ్చానో, నీకు తెలీందికాదు) నువ్వు మనసు కష్టపెట్టుకుంటే, నాకూ బాధగావుంటుంది. హృదయం ద్రవించిపోతుంది. నువ్వు దూరంగా ఆలోచించు. అర్థంలేని అభిమానాన్ని పెంచుకొని, బాంధవ్యాలు పోగొట్టుకుంటామా చెప్పు? ఉద్యోగంవిషయంలో కూడా మీ మావయ్య అంటున్నాడురా; తనతో వస్తే ప్రయత్నిస్తాననీ. నువ్వు రానంటున్నావట. అవుతే, యీ విషయంలో నిన్ను బలవంతపర్చను. అది, నీవ్యక్తిగతవిషయం. కాని, ఒక్కటిమాత్రం

జ్ఞాపకంవుంచుకో. ఈ పట్టుదలలనీ, ఆశయాలనీ, అన్న వాటిని విడిచిపెట్టుకోవాలిరా !

రా : (నవ్వి) సౌఖ్యం కలుగజేసుకోనని చెప్తానే సలహా లిస్తున్నారేమిటి నాన్నా !

పు : మనసు వుండబట్టదురా! నువ్వు యోగ్యుడవయ్యావు. నీకు నేను చెప్పాల్సిందేమీ లేదు. మీ మావయ్యతో వెళ్ళు; ఎవరితోనో మాట్లాడి, వుద్యోగం ఇప్పిస్తా నంటున్నాడు. నీకు వుద్యోగమయ్యిందంటే, నాకు యిక యీ జీవితంలో యే విచారమూ వుండదు. నిన్ను ఒక యింటివాడినిగా చేసేస్తే, నా బాధ్యత పూర్తిగా తీరిపోతుంది.

రా : అవన్నీ అప్రస్తుతం నాన్నా! మీకు బండికి వేళవు తుందేమో వెళ్ళండి.

పు : ఔన్రోయ్. మాటల్లోపడి మర్చిపోయాను. (లోపలికి పోతాడు. క్షణంలో ఓ చేతిసంచితో తిరిగివచ్చి) వస్తారా మర్రి. మావయ్యగారింటికి వెళ్ళడం మాన కేం–(బైటికి పోతాడు)

[రామం అయోమయంగా పచారుచేస్తుంటాడు. సోమయాజులు ప్రవేశం.]

సోమ : (వస్తూ) ఏవిటోయ్, గది వైశాల్యం కొలుస్తున్నావా యేవిటి?

రా : (ఆగి) ఓ! నువ్వా యాజులూ! రా...కూచో.

సోమ: (కూచుని) ఏవిటోయి. పరిష్కారాని కందని సమస్య యేదో యెదురైనట్టు పచారుచేస్తున్నావు ?

రా : ఔనోయ్, నాలాంటివాడికి యింకేం సమస్య వుంటుంది చెప్పు? జీవితసమస్యే. అది కొరకరాని కొయ్యలా తయారయ్యింది. నేను, యింత నిష్ప్రయోజకుణ్ణవుతానని యెప్పుడూ అనుకోలేదోయ్.

సో : ఆమధ్య సర్వీస్ కమీషన్ పరీక్షకి వెళ్ళావుకదా, యెలా రాశావేవిటి?

రా : బాగానే రాశాననుకో; అయినా, ఫలితం వుంటుందని నాకు నమ్మకంలేదు.

సో : జ్యోతిషం చూపించావా యేవిటి, అంత నమ్మకంగా చెప్తున్నావు?

రా : లేదోయ్. అలా అని నా అంతరాత్మ చెప్తోంది. యింతకుముందు వెళ్ళిన పరీక్షలోకూడా తృప్తికరంగానే ఆన్సర్ చేశాను. అయినా సరే సెలెక్టు కాలేదు. అందుకే – యిప్పుడూ ఆ ఆశ అగుపించడంలేదు.

సోమ : ఈ రోజుల్లో అర్హతలకి విలువెక్కడుందిలేవోయ్? ఈరోజుల్లో కావల్సింది డబ్బు. లేకపోతే పరపతి. ఈ రెంటిలో యే ఒక్కటివున్నా, కార్యాన్ని సాధించవచ్చు. ఏవిటో, నీకీ పిచ్చి పట్టుకుంది. ఒహారి సహాయంతో వుద్యోగం సంపాదించనని మడిగట్టుకూర్చున్నావుగాని, లేకపోతే యీ సరికి యెందులోనో అవకాశం వచ్చివుణ్ణు.

రా : (వినే ఓపికలేక) పోనీలేవోయ్. ఇప్పుడవన్నీ యెందుకు? నా అదృష్టం యెలావుందో, యేవిటో !

సోమ: ప్చ్: అంతేనా ! నీతో ఒక విషయం చెప్పాలని వచ్చానోయ్.

రా: ఏవిటి ?

సోమ: మన సమితి వార్షికోత్సవం జరపాలని అనుకొంటున్నాం. ఈవేళ సాయంత్రం మీటింగు వుంది. నువ్వు తప్పకుండా రావాలి. కొన్ని ముఖ్యవిషయాలు మాట్లాడుతారుట.

రా: (నిరుత్సాహంగా) నా జీవితసమస్యల్నే పరిష్కారం చేసుకోలేకపోతున్నానోయ్ యాజులూ ! అట్లాంటి నేను, ఓ సమితిలో సభ్యుడుగావుండి, సాధించే దేవిటో నాకు అర్థంకాదు. క్రమంగా నాలో నిరుత్సాహం పేరుకుపోతూవుంది.

సోమ: నీలాంటి ఔత్సాహికులు కూడా యిలా అంటే యెలా రామం ? ఆశయాలు వేరు, జీవితం వేరూను. జీవితంలో వూహించుకున్న ఆశయాలు యేఒక్కటీ ఆచరణకు అందకపోవచ్చు. అయినాసరే, ఆ ఆశయాలు పట్టుతప్పవు. అవి, జీవితాంతంవరకూ మనల్ని అంటిపెట్టుకునే వుంటాయి. జీవితపోరాటంలో ఓటమిని యెదుర్కొన్నావని, ఆశయాల్ని మంటగలుపుకుంటావటోయ్ ?

రా: తప్పదు యాజులూ ! జీవిత పోరాటంలో ఓటమి యెటువంటి నిరుత్సాహాన్నీ, నైరాశ్యాన్నీ కలిగిస్తుందో నీకు తెలీదు. అల్లాంటి సంఘటన నిన్నెప్పుడూ

ఎదుర్కో లేదు. కాని, జీవితమంతా తీరని సమస్యల మయం. అడుగడుగునా నిరాశ నన్ను కృంగదీస్తోంది.

సోమ: (సూటిగా రామం మొహంలోకి చూస్తూ) ఈవేళ చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావు రామం!

రా : విచిత్రంకాదు యాజులూ! ఉన్నవిషయం విడమర్చి నీతో చెప్తున్నాను. (నిట్టూర్చి) మా అమ్మ చని పోయింది. మా బాధ్యత మా నాన్నగారిపై పడింది. ఇక, మా ఆలనా, పాలనలో యేవిధమైన సుఖమూ పొందలేకపోయాము. మా నాన్న యెన్నో కష్టాలకు గురియై ఒక్కడూ ధైర్యంగా నిలబడి మమ్మల్ని పైకి తెచ్చాడు. నాకు చదువు చెప్పించాడు. మా చెల్లా యికి పెళ్ళిచేశాడు. నిజంగా, మా నాన్న యెన్ని శ్రమలు పడివుంటారో, నువ్వే ఆలోచించు. ఇప్పుడు నేను చేతికందాను. అయినా, ప్రయోజకుణ్ణి కాలేక పోయాను. నాకు వుద్యోగం దొరకటం దుర్లభ మయ్యింది. నేను యెవ్వర్నీ ఆశ్రయించలేదు. ఎవరి సహాకారమూ కోరలేదు. అందుకే, నా వుద్యోగం ఒక సమస్య అయ్యింది. ఇప్పుడు మా చెల్లాయికి బాగులేదని వుత్తరం వచ్చింది. ఆమెకి యెలావుం టుందోనన్న విషయం ఒకపక్క బాధిస్తూనేవుంది. ఇన్ని నిరాశలమధ్య ఆశతో బ్రతకమంటే, యెలా చెప్పు?

సోమ: (కాస్త ఆగి) ఆశ నిరాశలమధ్యే 'ఆశ' వుంటుందని, యెందుకనుకోవు రామం? నిరాశతో గుండెలు

బ్రద్దకాతున్నా ఆశతో, మిణుకుమిణుకుమంటూన్న జీవితాన్ని గడపడమే ఆశావాది లక్ష్యం. ఒక కవి అన్నట్టు ఆశలేకపోతే జీవితమే లేదు.

రా : నేనూ మొదట్లో ఆశావాదినే యాజులూ! జీవిత మంటే, లక్ష్యం వుండేదికాదు. కాని, యిప్పుడు నాలో ఆ నమ్మిక క్షీణిస్తోంది. క్రమంగా దట్టమైన చీకటిలా నిరాశ నన్నలముకుంటోంది. నిరాశా వాదినై పోతున్నాను.

సోమ: అంటే, నీలో యేదో బలహీనత వుందన్నమాట.

రా : అయుండొచ్చు. అది కేవలం పరిస్థితులు యేర్పరచిన బలహీనతేమో! ఎదుర్కొనేశక్తి లేనప్పుడు యేం చేస్తాం? వహాతుంది మరి?

సోమ: అవన్నీ మనసులో వుంచుకోకు రామం! నామాట విని, నలుగురిలో తిరుగు. మునుపటిలా స్వేచ్ఛగా జీవితం గడిపేందుకు ప్రయత్నించు. అప్పుడు, యీ ఆలోచనలు నీకు దూరంగా వుంటాయి.

రా : అదేమిటోయ్, అలా అంటావు? గంపెడు బరువు నెత్తినపెట్టుకొని నడిచేవాణ్ణి పరుగెత్తమంటే, వాడేం పరుగెత్తగలడు?

సోమ: పరుగెత్తగలడు. ఎలా అంటావేమో! అనవసరమని పించే కొంత సామగ్రి తగ్గించుకుంటే.

రా : అనవసరమైనవి లేకపోతేనో?

సోమ: కనీసం ప్రాముఖ్యతనుబట్టి, అవసరమైనవే వుంచుకొని మిగతావి వదిలించుకోవాలి.

రా : చెప్పడమైతే సుళువుగా చెప్తున్నావుగాని, దైనందిన జీవితంలో అది చాలా కష్టం.

సోమ: ప్రయత్నిస్తే యేదీ కష్టంకాదు రామం! ఇప్పుడీ తర్కంలోకి దిగామంటే పొద్దుపోతుందేమో! ఇవన్నీ ఇప్పుడెందుకులే! తీరిగ్గా ఓరోజు మాట్లాడుకుందాం. ఈ వేళమాత్రం నువ్వెలాగైనా రావాలోయ్. ఆరోజుకి యేయే ఏర్పాట్లు చెయ్యాలో, యెవరెవర్ని ఆహ్వానించాలో, అవన్నీ నిర్ణయిస్తారుట.

రా : సరే ... ప్రయత్నిస్తాను. (ఆగి) యెవరో వస్తున్నట్టుంది...

[శివం వస్తాడు. నవనాగరికంగా వుంటాడు.]

శివం : (ఈల వేసుకుంటూ ప్రవేశించి) హల్లో బావా! ఇంట్లోనే వున్నావా ? ఉండవేమో ననుకున్నాను.

రా : నువ్వటోయ్! ఇంకెవరో అనుకున్నాను.

శివం : మీ యింటికి రావాల్సిన వ్యక్తుల్లో నేను ఒకణ్ణి కాదా యేమిటి ?

రా : అలాగని నే నన్నానా ?

శివం: అలా అనవులే, నాకు తెలుసు. సరేగాని – యింకా బయల్దేరలేదేం ? నాన్నగారు నన్నందుకే పంపారు. వూఁ...లే పోదాం.

రా : ఏమిటోయ్ ఆ తొందర, యేదో కొంపమునిగిపోయి నట్టు ? కాస్సేపు కూచో...వెళ్దాం. (శివం కూచుంటాడు. సోమయాజులు శివంని తేరిపారజూస్తూ

వుంటాడు) ఏవిఁటి యాజులూ, అలా పరకాయించి చూస్తున్నావు ?

సోమ: ఈఅబ్బాయిని యెక్కడో చూసినట్టు గుర్తుందోయ్...

శివం: (అందుకుని) ఐ యాం సారీ! నన్ను నేనే పరిచయం చేసుకోవటం నాకు అలవాటే లేదండి. పేరు శివం. అసలు పేరు సత్య సూర్య శివప్రసాదరావనుకోండి. అంత పెద్దపేరు వుచ్చారణచేసేందుకు వ్యవధి పడుతుందనీ, నవనాగరికతకు నియర్గా లేదనీ, యిలా కట్‌షార్టు చేశాను. మరి మీ పేరు ?

సోమ: సోమయాజులు ... మిమ్మల్ని యెక్కడో చూసి వుంటాను.

రా : మా మేనమామకొడుకోయ్...

సోమ: అలా చెప్పు...చదువుకుంటున్నారా ?

శివం : బి. ఏ. ఫైనల్ యియర్ చదువుతున్నానండి.

సోమ: బావుంది...అన్నట్లు, మీరు నాటకాల్లో వేషాలు వేస్తారా యేవిఁటి?

శివం : (ఉత్సాహంగా) అంటే ? ఆ కోవకిచెందినవాడిలా అగుపిస్తున్నానండి ?

సోమ: కోపంతెచ్చుకోకండి. మీ వైఖరిచూసి అలా అనిపించింది.

శివం : (చిన్నగా నవ్వి) అబ్బే ! కోపమెందుకండీ ! అసలు, నాకు నాటకాల్లో వేషంవెయ్యటమంటే, యెంతో సరదా ! కాని, ఆ అవకాశం యింతవరకూ అందు

బాటులోలేదు. అందుకే, యెప్పటికైనా వుపయో గిస్తుందని, జుత్తుకూడా యిలా పెంచి వుంచాను.

సోమ: (రామంని వుద్దేశించి) రామం! మన సమితి వార్షి కోత్సవసందర్భంలో ఒక నాటిక వేయాలనుకుంటు న్నాంలే! అందులో మీవాడికి అవకాశంకలిగిస్తే బావుంటుందేమో!

రా: (నవ్వి) పర్సనాలిటీవుంటే సరిపోతుందా యాజులూ? నటించేయోగ్యత, శక్తీ వుండొద్దూ?

శివం: (నిరుత్సాహంగా) ఏవిఁటి బావా, అడుగులో హంస పాదు పెడుతున్నావు? నా కలలకి ఒకరూపంఅంటూ యిప్పుడిప్పుడే యేర్పడుతూవుంటే, నువ్విలా మొదటే వాటిని చెరిపెయ్యాలని చూస్తున్నావా?

సోమ: అదికాదు రామం. ఏ పుట్టలో ఏ పాముందో యెవరికి తెలుసు? ఈతనిలో అంతర్గతంగా యేవిధమైన నటనాశక్తి దాగివుందో, నీకు తెలుసునా? ప్రథమ ప్రయత్నంతోనే యెంతమంది ఉత్తమనటులుగా రూపొంది పేరు తెచ్చుకోలేదు. ఈయనకూడా మంచి నటుడౌతాడని నాకుమాత్రం నమ్మకముంది.

శివం: (ఉత్సాహంగా) మీకు నేను చాలా కృతజ్ఞుణ్ణండీ సోమయాజులుగారూ! నిజంగా నేను మంచినటునిగా రూపొందినా, కాకపోయినా, నామీద మీకు యిల్లాంటి సద్భావం, అదీ ఒక వున్నతభావం కలగ టం అదే పదివేలు. నువ్వేమీ మాట్లాడవేం బావా?

రా : మా యూజు లన్నమాటకూడా నిజమేనోయ్. ఏమో నీలో ఆ ప్రతిభ వుందేమో, ఎవరు చూశారు? కాని, యీ రంగంలోకి దిగితే, మీ నాన్న యేమంటారో?

శివం : తెలవనిస్తామా యేవిటి?

రా : ఒకవేళ తెలిసిందే అనుకో! ఇక ఆ నిందంతా నా నెత్తిన పడేస్తారు. మీ నాన్నగారి మాట అలుసే. మీఅమ్మ నన్ను యెన్నయినా ఆడిపోస్తుంది.

శివం : ఆ సంగతి నేను చూసుకుంటానుగా! (మెల్లగా) నీకు తెలీదుగాని బావా, అమ్మని మెప్పులతో కాస్త పైకెత్తామంటే చాలు – మురిసిపోయి మరేమీ అనదు.

రా : మరి, నీ చదువు సంగతి?

సోమ: నువ్వు మరీనోయ్. మనం చదువుతోనే యివన్నీ సాగించేవాళ్ళం కాదూ? అలాగే!

రా : సరే అవుతే; మావాణ్ణికూడా మన సమితిలో సభ్యుడుగా చేర్చుకోండి.

శివం : (వుత్సాహంతో) ఔనండీ! సభ్యత్వపు చందా యెంతో చెప్పండి. యిప్పుడే యిచ్చేస్తాను. (పర్సు తీస్తాడు)

రా : (నవ్వి) నువ్వు డబ్బున్నవాడివని తెలుసులేవోయ్. ఇప్పుడే యెందు కివ్వటం. తర్వాత యివ్వొచ్చునులే!

శివం : (నిరుత్సాహంగా పర్సు జేబులో పెట్టి) నువ్వెప్పుడూ నన్ను యిలాగే. యెత్తిపొడుస్తూవుంటావు బావా! ఇది ఒకవిధంగా నన్ను అవమానిస్తున్నట్టుకూడాను.

నాకది మరీ బాధగా వుంటుంది. నాలో రేగిన వుత్సాహంకొద్దీ అలా అన్నానేగాని, డబ్బు మస్తుగా వుందనికాదు.

రా : (భుజంతట్టి) అప్పుడే కోపమొచ్చేసిందటోయ్? అబ్బే! పరిహాసానికి అన్నాలే, మరేమీ అనుకోకు.

సోమ: మీ బావమాటలు యెప్పుడూ అలాగేవుంటాయిలెండి మరేమీ అనుకోవద్దు. సరేగాని రామం, నువ్వీవేళ వస్తున్నట్టేకదూ ?

రా : ప్రయత్నిస్తాను.

సోమ: అదిగో, మళ్ళీ మొదటికే వస్తున్నావు. తప్పకండా రావాలి సుమా ! వచ్చినప్పుడు యీయన్నికూడా తీసుకురా.

రా : అలాగే.

సోమ: వస్తా మరి...వస్తానండీ శివంగారూ !

శివం : మంచిదండీ.

[సోమయాజులు నిష్క్రమిస్తాడు. శివం అతన్ని ద్వారంవరకూ అంపకంచేసి తిరిగి వస్తాడు]

శివం : హమ్మయ్యా! సరిగ్గా సమయానికి రావటం యెంతో మంచిదయింది.

రా : (అర్థంకాక) మంచిదవ్వడమేమిటి ?

శివం : ఏముంది బావా! నేను నటునిగా పనికొస్తానని ఒక్కరైనా గుర్తించడం జరిగిందికదా. రేపో మాపో మొహానికి రంగుపూసుకుని స్టేజిమీద నటిస్తాను. అంతకంటె కావల్సిన అవకాశం యేముంది ?

రా : అప్పుడే నువ్వు చాలా దూరంగా వూహిస్తున్నావు గాని, అది అంత సులభం కాదోయ్. యాజులు యిక్కడ చెప్పగానే అవలేదు. ఆ సమితిలో రాజకీయాలు బోలెడు. ఒకారిమాట ఒకారికి నచ్చదు. పేరుకి కార్యదర్శి, కోశాధికారి – నీళ్ళంతా వున్నారన్నమాటేగాని, నిజానికి దాన్ని నడిపిస్తున్న సభ్యులు వేరు. అందుకని వారి అభిమానుల్ని ఓ కంట చూస్తుంటారు.

శివం : మనకి ఆ రాజకీయాలు అనవసరం బావా !

రా : నీకు కావల్సింది వేషం. అంతేనా ?

శివం : ఔను.

రా : నే నిప్పుడు చెప్పిందంతా దాని విషయమే. వేషం దొరకడంలోకూడా రాజకీయాలే మరి.

శివం : అవుతే అక్కడా యీ చిక్కులే వున్నాయన్నమాట! అయినా, నువ్వు గట్టిపట్టు పట్టావంటే తప్పక నాకు వేషం దొరుకుతుందని నమ్మకంవుంది బావా !

రా : అది యెలాగూ జరుగుతుందనుకో !

శివం : చెప్పకేంగానీ బావా, నాకు చాలా రోజుల్నుంచీ నాటకాల్లో వేషంవెయ్యాలన్నవాంఛ మనసులో వేధిస్తూవుంది. ఈనాటికి నీ ధర్మమా అంటూ, అది నెఱవేరుతుంది.

రా : చాలించనోయ్ యీ పొగడ్తలు. పోదాం పద.

శివం : బైలుదేరు మరి; లేకపోతే, మళ్ళీ నాన్నగారు కబురు పంపుతారు.

రా : నిజంగా, మీ నాన్నకి నామీద యెంతో అభిమాన మోయ్.

శివం : అవుతే, మానాన్నగారికి తప్పించి మరెవ్వరికీ నీమీద అభిమానం లేదంటావు. ఏం ?

రా : (నవ్వి) అలా అని నేను అన్నానా చెప్పు ? అవుతే నేను మీ యింటికి వస్తున్నట్టు మీ అమ్మకి తెలుసునా ?

శివం : (నవ్వి) మా అమ్మ అంటే, నీకూ పక్కబెదురు వుందన్నమాట !

రా : (పరిహాసధోరణిలో) మెల్లిగా అంటున్నావు ! మీ అమ్మను దూరంనుండి చూసినాసరే, నాకు వణుకు పుడుతుంది.

శివం : నువ్వు యింత పిరికివాడవని అనుకోలేదు బావా !

రా : అబ్బే ! ఇది పిరికితనం కాదోయ్ మీఅమ్మనోటికి భయపడతానంతే ! ఉన్నది వున్నట్టు నీతో చెప్తున్నాను, మరేమీ అనుకోకు. నాకు తెలుసు—నువ్వు యీ విషయం మీ అమ్మ చెవికి సరఫరాచెయ్యవని.

శివం : నాసంగతి నీకు తెలీదు బావా ! అమ్మంటే నాకూ ఒకొక్కప్పుడు చెప్పలేనంత కోపంవచ్చి, కళ్ళల్లో 'ఠప్' మని ఆగిపోతుంది. అదేమిటో మరి, నోరు పెగలదు. నేను యెప్పుడన్నా డబ్బు అడుగుతాననుకో ! సవాలక్ష ప్రశ్నలు వేస్తుంది. పోనీ, యిన్ని ప్రశ్నలు వేసినా, చివరికి అడిగినంత డబ్బు యిస్తుందా అంటే, అబ్బే ! అందులోనూ కొసరడమే ! మామామయ్య

వచ్చి యింట్లో వున్నాడుగా, శనిపీడలా...ఆయన నోరువిప్పి అడగాలేగాని, యెంతైనా యిచ్చేస్తుంది.

రా : అతనికి బాగా డబ్బుందికదా, ఏగా అమ్మని యెందుకు అడుగుతాడోయ్ ?

శివం : ఉంది. కావల్సినంత వుంది. కరగబెట్టేవాళ్ళుకూడా యెవరూ లేరు. కాని, మావయ్య వున్నాడే, మాంచి యెత్తుగాడు. పైసాని పాపాయిలా చూసుకునే ఘటికుడు. ఎక్కణ్ణించయినా వచ్చే అవకాశం వుండాలిగాని, నిర్మొహమాటంగా రాబట్టుకుంటాడు.

రా : ఇంతకీ, అత నిప్పు డెందుకొచ్చాడిక్కడికి ?

శివం : అదే నాకూ అంతుబట్టకుండా వుంది బావా! అడిగితే వుద్యోగం సంపాదించడానికి వచ్చానంటాడు. వాళ్ళ వూళ్ళో ఉద్యోగాలు దొరకనట్టు. అసలు, ఆ ప్రయత్నమే చేస్తున్నట్టు అగుపించదు. ఆయన యిక్కడుండటం నాకు పరమ అసహ్యంగా వుంది.

రా : ఏం ? స్వంత మేనమామేగా ?

శివం : మేనమామేగానీ, మానవత్వమన్నది అతనిల్లో వెదికితే అగుపించదు. మంచీ చెడూ అన్న విచక్షణా జ్ఞానం వీసమెత్తయినా లేదు. మా శాంతని పెళ్ళి చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు చవట! అతని వయస్సెంత ? శాంత వయస్సెంత? నువ్వే చెప్పు. యీడూ, జోడూ యేమన్నా వుందా ?

రా : (షాక్ తిని) ఏమిటీ ! శాంతని పెళ్ళిచేసుకోవాలని చూస్తున్నాడా ? మీ అమ్మా, నాన్నా ఒప్పు కున్నారా ?

శివం : ఒకరు ఒప్పుకున్నట్టే.

రా : ఎవరు ?

శివం : ఇంకెవరు ? సాక్షాత్తూ మా అమ్మగారు. ఆమె దృష్టిలో అతను దివినుండి భువికి వచ్చిన దివ్యపురు షుడే ! ఒప్పుకోక యేం చేస్తుంది మరి? అసలు, ఆమె పట్టుదలే యిందులో హెచ్చని నా అనుమానం.

రా : మరి, మీ నాన్న యేమంటారు ?

శివం : ఒక్కొక్కప్పుడు నాన్ననిచూస్తే చాలాజాలివేస్తుంది బావా ! ఆయన యేమీ చెప్పలేరు. అంతా గుంభ నగా మనసులో వుంచుకుంటారు. తగవులాడరు. తగవులంటే ఆయనకి పరమఅసహ్యం. అందుకేనేమో అమ్మఅభిప్రాయం వినికూడా చెక్కుచెదరకుండా ఒక్కమాటైనా అనకుండా వూరుకొన్నారు. ఏం చెయ్యదలచుకున్నారో ఆయనకే తెలియాలి.

రా : శాంత 'వూఁ' కొట్టిందా ?

శివం : అబ్బే! అలాఅవుతే సమస్యేలేదుకదూ ! దాని దుర దృష్టానికి దుఃఖపడుతూవుంది. అబల అంతకంటె యేంచేస్తుంది? అవుతే, అధైర్యపడొద్దని నేను ధైర్యం చెప్పాన్లే.

రా : (ఆసక్తిగా) ఏమిటి చెప్పావోయ్ ?

శివం : ఆమెపెళ్ళి మావయ్యతో జరక్కుండా చూస్తానని హామీయిచ్చాను.

రా : అంటే యేం చెయ్యదల్చుకున్నావు ?

శివం : (దిగాలుపడి) అదే ఆలోచిస్తున్నాను బావా ! ఏవిటి చెయ్యడమా అని. నువ్వేదైనా వుపాయం ఆలోచించుదూ !

రా : (నవ్వి) మరి యెలా హామీయిచ్చావోయ్ ?

శివం : ఏదో, అప్పట్లో చెల్లాయికి ధైర్యం చెప్పాలని అలా అనేశాను.

రా : ఔనూ, మీమావయ్య మొదటిభార్య చనిపోయింది కదా, మరో గత్యంతరం లేనట్టుగా అట్లాంటివాడికి శాంతను ముడిపెట్టడమేవిటోయ్. ఆమెజీవితం పాడు చెయ్యడానిక్కాని—

శివం : అదే, నేనూ అంటున్నది బావా ! ఈ అక్రమాన్ని అరికట్టడ మెలాగో అవగాహన కాకుండావుంది.

రా : పోనీ, నువ్వే మీ అమ్మను నిలదీసి అడగరాదూ ? సొంత చెల్లెలి మంచిచెడ్డలు చూసే హక్కు నీకు ఆపాటి లేదూ ?

శివం : (నిరుత్సాహంగా) నిజమే, కాని – మా అమ్మనోటికి నువ్వెంత భయపడతానో, నేనూ అంతే ! ఈ పరిస్థితిలో యేం యెదిరించినా, నాన్నగారే యెదిరించాలి కాని, ఆయన అపరధర్మరాజు. బొత్తిగా మెతక.

రా : మెతక కాదు శివం ! అది మంచితనం. మీ నాన్న యెప్పుడూ కష్టం కలిగించరు. కనీసం ఆ ప్రయత్న

మన్నా చెయ్యరు. ఆ మంచితనాన్ని ఆధారంగా తీసుకుని, చాలామంది స్వప్రయోజనాలు సాధించు కోడానికి ప్రయత్నిస్తుంటారు.

శివం : ఎలాగైనా అంత మంచితనం పనికిరాదు బావా!

రా : అక్కడే పొరబడుతున్నావోయ్. మంచితనం సహ జంగా అందరిలోనూ వుండదు. అది యే కొద్దిమం దికో పూర్వజన్మ సుకృతంవల్ల అబ్బుతుంది. అంటే, దానికున్న విలువ యేమిటో నువ్వే వూహించుకో! మీనాన్న అందరిదగ్గరా మంచివాడనిపించుకుని, మన్ననలు పొందుతున్నాడంటే, అందుకు కారణం మంచితనం కాదంటావా?

శివం : అది నిజమే అనుకో; కాని, యింటివ్యవహారాలు అనుకూలంగా పరిష్కారంచేసుకునేందుకు వుప యోగపడని మంచితనం యెందుకూ అంటాను. ఒక్కొక్కప్పుడు కాఠిన్యతవహిస్తేనేగాని, కొన్నిసమ స్యలు పరిష్కారం కావు. 'కాఠిన్యత వహించను' అని కాలుమీద కాలువేసుక్కూర్చుంటే; వాటికి మరి పరిష్కారమార్గం యేదీ ?

రా : మీ నాన్న యేం ఆలోచిస్తున్నారో, నీకూ నాకూ తెలుసునా? అవసరమొస్తే యెదిరిస్తారేమో చూస్తూ వుండు.

శివం : చూడాలి మరి ?

రా : వేళవుతోంది...పదవోయ్ పోదాం.

శివం : ఔను నిజమే! పద పోదాం...అన్నట్టు. సాయంత్రం మనం మీ సమితికి వెళ్తున్నట్టేనా ?

రా : తప్పకుండా.

శివం : ఈ పీడ నా వెంట యెందుకనుకుని, నాకు చెప్పకుండా పోవుగదా !

రా : (నవ్వి) బాగుందోయ్! నన్నంత మోసకారిగా భావిస్తున్నావా యేవిటి ? నిన్ను తీసుకెళ్ళినందువల్ల నాకు వచ్చేనష్టం యేమీ లేదుగా !

శివం : ఊరికనే అన్నాలే బావా ! ఇంట్లోమాత్రం యీ విషయం పొక్కనీకు సుమా; శాంతతోనైనా సరే...

రా : ఏం, మీ యిద్దరికీ పడదా ?

శివం : అబ్బే! అదేమీ కాదు. ఏమో, మాటవరుసకైనా అమ్మతోగాని, నాన్నతోగాని అనేస్తుందేమోనని. రంగంలోకి అడుగుపెట్టకముందే అవాంతరం వస్తుందని నా భయం.

రా : లేదులేవోయ్. ఎవరితోనూ చెప్పను పద...
(ఇద్దరూ బైటికి నిష్క్రమిస్తారు)

[ తెరపడుతుంది ]

# నిమిత్తమాత్రులు

## 3 వ దృశ్యం

[రంగాలంకరణంతా మొదటి దృశ్యంలానే వుంటుంది. వెంకటేశ్వర్లు సోఫాలో కూచుని పత్రిక చదువుతూవుంటాడు. నరసయ్య ప్రవేశిస్తాడు.]

నర : నమస్కారమండీ !

వెం : (పత్రిక పడేసి) ఓ, మీరా...రండి...కూచోండి.
[నరసయ్య కూచుంటాడు. వెంకటేశ్వర్లు అతనివేపు అనుమానాస్పదంగా చూసి]

వెం : మళ్ళీ యేమొచ్చారు? మా బావమరిది ఆ అమ్మాయిని యింకేమన్నా అన్నాడా ?

నర : (చిన్నగా నవ్వి) అబ్బే ! పొరపాటు జరిగిందండీ ! ఆ మాటే చెప్పాలని వచ్చాను. మీవంటి మర్యాదస్తుని బావమరిది యిలా ప్రవర్తించాడా అని అనుమానం కలిగి ఆ అమ్మాయిని మళ్ళీ అడిగాను. ఆమె చెప్పడంలో పొరబడింది. ఎవరో వెంకటేశ్వర్రావుగారి బావమరదట. పోలికలు యిప్పుడు చెప్పింది. వయస్సు పాతికేళ్ళకంటే అధికం వుండదట. అతని

పేరూ గజపతే అవటం యీ చిక్కు తెచ్చిపెట్టింది లెండి. దానిమాటలు నమ్మి, నేను మిమ్మల్ని అడిగాను. క్షమించాలి. మరేమీ అనుకోకండి.

వెం : (ఉత్సాహంగా నవ్వి) అదీ...అలా చెప్పండి. మా కుటుంబాల్లో యెక్కడా యిల్లాంటి జులాయిపనులు లేవు సుమండీ! మా బావమరిది కేం ఖర్మ, యిల్లాంటి వాళ్ళని అర్థించటం? అదీగాక, భార్య చనిపోయి అత డిప్పుడు దుఃఖసముద్రంలో మునిగివుంటే, యిప్పు డీ ప్రణయాలు జరుపుతాడా! నేను మొదటే నమ్మలేకపోయాను.

నర : అందుకే, యిప్పుడు మీ దగ్గర క్షమాపణ చెప్పుకోడానికి వచ్చానండీ! మీరు అన్యథా భావించకండి.

వెం : అబ్బే! దానికేముందిలెండి. పొరపాట్లనేవి అందరికీ వస్తుంటాయి.

[గజపతి బైట్నుంచి వస్తాడు. కుర్చీలో కూచుని పత్రిక చదువుతూ]

గజ : ఈయన యెవరు బావా?

వెం : నరసయ్యగారు...యీ వూరేలే...

గజ : ఓహో! ఈయనేకదూ, ఆ రోజు నా మీద యేదో చెప్పాడని అన్నారు? ఇప్పుడు నా మొహంమెదుట చెప్పమనండి! ఏమండీ నరసయ్యగారూ!

నర : క్షమించాలండీ! పొరపాటు జరిగిందని యిప్పుడే మీ బావగారితో విన్నవించుకున్నాను.

వెం : ఆ విషయమే యిప్పుడీయన చెప్తున్నారులే.నోయ్...
నువ్వు కాదట...ఇంకెవరో మరో గజపతట.

గజ : హమ్మయ్య! ఇప్పటికన్నా మీరు నమ్మారుకదా!
అదేచాలు. (పత్రిక చదవటంలో నిమగ్నుడౌతాడు)

నర : వెంకటేశ్వర్లుగారూ!

వెం : ఏవిటండీ?

నర : మీతో ఒక విషయం మనవిజేసుకోవాలని వుందండీ!

వెం : చెప్పండి.

నర : (లేచి నిల్చుని) నేనూ ఒకప్పుడు బాగా బ్రతికినవాణ్ణే.
మాకూ బాగా డబ్బుండేది. కాని, క్రమంగా ఇంటి
బాధ్యతలు అధికమై నా ఖర్చులు అపరిమితమై,
యిప్పుడిలా చితికిపోయాం. ఇన్నాళ్లూ వుద్యోగం
అవసరం లేదనేవాణ్ణి. కాని, యిప్పుడు ఆ అవశ్యకత
అగుపిస్తోంది. అందుకని, మీదగ్గర యేదైనా వుద్యో
గం యిప్పిస్తే...(సవినయంగా చేతులు నలుపు
తుంటాడు.)

వెం : (వింతగా చూసి) నా దగ్గరా! నా దగ్గరేం వుద్యోగం
వుంటుందండీ?

నర : లేకపోవచ్చు. కాని, మీ అంతటి ప్రముఖ వ్యక్తులు,
సంపన్నులు, మీకు అండదండగా వుండేందుకు ఒక
వ్యక్తిని వుంచుకోవడం ఎంతో అవసరమనిపిస్తుంది-
అందుకు అన్నివిధాలా నేను సమర్థుడనని నా మనసు
చెబుతోంది. నాసంగతి మీకు పూర్తిగా తెలుసునో
లేదోగాని, వూళ్లో యెవర్నయినా అడగండి చెప్తారు,

అల్లాంటి నన్ను మీకుకుడిభుజంగా పెట్టుకున్నారంటే అనేక విషయాల్లో మీకు సహాయకారిగా వుంటాను. అప్పుడు మీ మీద ఈగకూడా వాలేందుకు భయపడుతుందంటే నమ్మండి.

వెం : (మందహాసం చేసి) చూడండి నరసయ్యగారూ ! ఏ ప్రమాదం రాకుండా కాపాడేందుకుగాను, యెవర్నయినా అండదండగా వుంచుకోవాల్సిన అవసరం యెవరికైనా యెప్పుడు వస్తుందంటారు ? అతనిలో పాపపుచింత లున్నప్పుడు; ఏ ప్రమాదం యెప్పుడు వాటిల్లుతుందోనన్న భయంతో గుండెలు కొట్టుకున్నప్పుడు; అన్యాయాలు, మోసాలూ చేస్తూ ప్రజల్ని పీడిస్తున్నప్పుడు. (నవ్వి) కాని, నాకు అల్లాంటి చింతలూ లేవు, భయమూ లేదు. ఒక్కమాట చెప్తాను వినండి. మనం మంచివాళ్ళమైతే ప్రపంచమంతా మంచే !

నర : (నిరుత్సాహంగా) మీ రలా అంటే, నేనేం చెప్పను చెప్పండి ? గంపెడాశతో వచ్చాను.

గజ : (కలుగజేసుకుని) పోనీ బావా, అత సంతగా ప్రాధేయపడుతున్నప్పుడు, కనీసం ఓ నెలరోజులపాటు వుద్యోగంలో వుంచి ఫలితం చూడరాదూ ? అతను మీకు కొన్ని వ్యవహారాల్లో వుపయోగపడతాడేమో !

వెం : అబ్బే ! నాకు యెవరి సహాయమూ అవసరంలేదోయ్. అతనికి ఆశ కలిగించటం నాకు యిష్టంలేదు. అంత్య నిష్ఠూరంకంటె, ఆది నిష్ఠూరమే మంచిది కదూ !

గజ : మీకు మీరు దూరంగా ఆలోచించలేదు బావా! అవసరానికి ఆదుకునేవాళ్ళు మీ యింట్లో యెవరున్నారు? మీరా వృద్ధాప్యపు పడిలో పడినవారు. శివం వున్నాడూ అంటే, చిన్నవాడు. మీ యింట్లో జరిగేవి డబ్బుతో వ్యవహారాలు. రోజులుచూస్తే యేమీ బాగాలేవు. ఏక్షణాన యే ప్రమాదం వస్తుందో, ఎప్పుడు పనివాళ్ళు తిరుగబడతారో, ఎవ్వరమూ చెప్పలేం కదా!

వెం : (నవ్వి) నాకు ఆ భయం సుతరాం లేదోయ్. ఇంత వరకు నే నెవరికీ అపకారం చెయ్యలేదు. పైగా వుపకారమే చేశాను. ఎవరైనా నాకు అపకారం చెయ్యడానికి ప్రయత్నిస్తారంటే, నేను మాత్రం నమ్మను.

గజ : ఆశ, మనిషిని క్షణక్షణానికీ మార్చేస్తుంది బావా! ఎవరికి, యే క్షణాన ఆ ఆశ జనిస్తుందో యెవ్వరమూ చెప్పలేం. మీరు అనుకుంటున్నారు మీ కెవ్వరూ విరోధులు లేరని. కాని వెనుక గోతులు త్రవ్వేవాళ్ళు యెప్పుడూ వుంటారు.

నర : అందుకని, నాలాంటివాడు మీకు చేదోడువాదోడుగా వుండడం యెంతేనా అవసరమండీ!

వెం : (విసుగ్గా) నన్ను మరి వేధించకండి నరసయ్యగారూ! మీకు సహాయంచేయలేకపోతున్నందుకు నాకూ విచారంగానే వుంది. ఎప్పుడన్నా అవసరంకలిగితే

మీకు కబురుపంపుతాన్లెండి. కాస్త పనుంది...
వస్తా...(పత్రిక పట్టుకుని విసుగ్గా లోపలికి పోతాడు)

గజ : (బావపోయిన వేపే చూస్తూ క్షణంపోయాక)ఊఁహూఁ! ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయిందండీ నరసయ్యగారూ! మా బావతో వచ్చిన చిక్కేయిది. అతని మనసులో ఒక అభిప్రాయం స్థావరం ఏర్పర్చుకున్నదంటే, చచ్చినా దానికి చలనం వుండదు. మీరు నాకు అండగావుండి నాకోరిక నెరవేరే వరకూ నాకు సహాయపడతారని అనుకున్నాను. కానీ, కథ అడ్డంతిరిగింది.

నర : ఫరవాలేదులెండి. చేతనైన సహాయం యిప్పుడన్నా చెయ్యగల్నుా. ఒక అపవాదునుండి తప్పించేశానా?

గజ : (సంతోషంగా) బ్రహ్మాండంగా తప్పించారు. మా బావకూడా గుడ్డిగా నమ్మేశాడు. అతను అంతేలెండి. నల్లనివన్నీ నీళ్ళు, తెల్లనివన్నీ పాలు, అనుకునే వట్టి అమాయకుడు. మీరు చేసిన సహాయానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

నర : (నవ్వి) వట్టి కృతజ్ఞతేనా? మరి నాకు బహుమతి?

గజ : (చకితుడై) మొన్ననే యిచ్చానుగా పాతిక?

నర : (హేళనగా నవ్వి) అంతటితో చాలించాలనుకుంటున్నారా? అలా కుదరదండోయ్! కావాలంటే, మళ్ళీ మీమీద కథ అల్లేయగలను. లేదా, ఆ అమ్మాయినే తీసుకొచ్చి మీ బావగారి యెదుట నిలబెట్టేస్తాను.

గజ : (భయంగా) అబ్బె! అలా చెయ్యకండి. మీకు పుణ్యముంటుంది. కట్టుకున్న ఆశాసౌధాలు ఒక్కసారిగా కూలిపోతాయి. మీరు అడిగితే కాదంటానా? (పర్సుతీసి డబ్బుతీస్తాడు. చుట్టూ కలయజూసి) అందాకా యీ పాతిక వుంచండి. ఈసారి యింకేదన్నా సహాయంచేస్తే, అప్పుడు మళ్ళీయిస్తాను. (డబ్బు యిస్తాడు)

నర : (డబ్బు జేబులోపడేసుకుని) అన్నట్టు, మీ మేన కోడల్ని పెళ్ళిచేసుకుందుకు మీకు పోటీగా ఎవరో వున్నారని చెప్పారు; ఎవరతను?

గజ : (మెల్లగా) ఔనౌను. సరిగ్గా జ్ఞాపకంచేశారు. ఉన్నాడులెండి ఒకాయన. ప్రస్తుతం యీ యింట్లోనే వుంటున్నాడు. పోటీ యేమిటిలెండి? చివరికి గెలుపు మనదే. అయినా, అసలు పోటీలేకుండావుంటే మరీ మంచిదికదూ!

నర : ఔను; మీరన్నది వాస్తవం. ఇల్లాంటివాట్లో, అసలు పోటీ వుండనేకూడదు. అందుకని అతణ్ణి...

గజ : కాస్త మెల్లిగా మాట్లాడండి, గోడకిచెవులుంటాయి.

నర : అందుకని అతణ్ణి... (సఫాచేద్దామా అని సౌంజ్ఞ చేస్తాడు)

గజ : (గాభరాగా) అబ్బెబ్బె! (చుట్టూచూసి) అలాగవుతే ఇక, ఆఅమ్మాయి నన్ను మరీ అసహ్యించుకుంటుంది. మొదటికే మోసంవస్తుందేమో!

నర : మరేం చేద్దామంటారు?

గజ : మతి భ్రమించేట్టు, తలపై బలమైన దెబ్బ వేస్తే !

నర : అది మరీ బలంగా తగిలితే చచ్చిపోతాడేమో !

గజ : మంచి చిక్కే నే ! (క్షణం ఆలోచించి) ఆఁ, .ఒకలా చెయ్యండి. నాకు యే అపవాదూ రాకుండావుండా లంటే, అసలు ఆ అనుమానమే కలక్కుండా వుండా లంటే, ఒకే ఆలోచన తడుతోంది. మీరు ఆ అబ్బా యితో యేదో అవకాశం కలిగించుకుని, చిన్న తగవు తెచ్చుకొని, మాటలుమీరి, చెయ్యిచేసు కోండి. అది రాత్రిపూట జరిగితేనే బావుంటుంది. అప్పుడేంజరిగినా మీకు ప్రమాదంవుండదు.

నర : ఇది చాలాబావుందండీ ! మరి ఆ అబ్బాయిని నాకు ఒకసారి చూపించాలి.

గజ : ఓ! అలాగే.

నర : మరి అడ్వాన్సు ?

గజ : (విస్తుపోయి) దేనికి?

నర : (నవ్వి) తెలీనట్టు మాటాడతారేం? ప్రతిపనీ అడ్వా న్సుమీదుగానే జరుగుతుందని యింతకుముందేగా చెప్పాను. ఈ రోజుల్లో యెవర్నీ నమ్మలేంచూడండి!

గజ : (విసుగ్గా) మంచిచిక్కే నే! సరేలెండి (పర్సుతీసి పాతిక రూపాయలిచ్చి) ప్రస్తుతానికి యీమొత్తం వుంచండి. ఇది సవ్యంగా, నిర్విఘ్నంగా జరిగిపోతే నా యథా శక్తిని మళ్ళీ యిస్తాను.

నర : (డబ్బు జేబులోపెట్టుకుని) మనం తలపెట్టడమూ, అది సవ్యంగా సాగకపోవడమూనా ? మన తడాఖా

మీకు తెలీదుగాబట్టి అలా అంటున్నారు. ఇప్పుడు తెలుసుకుంటారుగా.

గజ : అంతేనండీ అంతే! అనుభవమైతేనేగాని, యేదీ తెలుసుకోలేంగదా!

నర : మరి నేను శలవుతీసుకుంటానండీ! ఆ అబ్బాయిని నాకు యెప్పుడు చూపిస్తారు?

గజ : రేపుసాయంత్రం అయిదుగంటలకి పార్కులో వుంటాడతను. ఏదో పని కల్పించుకుని నేనే అతనితో మాట్లాడుతూవుంటాన్లెండి. అప్పుడు మీరూ చూడొచ్చు.

నర : అలాగే. ఏదీ ఒక సిగరెట్టు యిలా పారేయండీ.

(గజపతి సిగరెట్ యిస్తాడు)

నర : వస్తానండీ. (వెళ్ళిపోతాడు.)

(అప్పుడే వెలుపలనుండి వస్తున్న చిన్నయ్య తారసపడి, నరసయ్య వేపు అనుమానాస్పదంగా చూస్తాడు.)

చిన్న : (గజపతికి దగ్గరగా పోయి) బాబూ!

గజ : ఏంరా!

చిన్న : ఈ నరసయ్యగారు యెందుకొచ్చినారండీ!

గజ : (కాస్త తత్తరపడి) ఏమో! నాకేం తెలుసు?

చిన్న : అదేంటి బాబూ! మీరిప్పుడేగా అతనితో మాట్లాడుతున్నారు? వస్తానని మీకేకదా చెప్తున్నారు?

గజ : (కలవరపడి) అబ్బే! ఏమీలేదురా! బావతో మాట్లాడ్డానికి వచ్చాడు. ఏదైనా వుద్యోగం కావాలని అడిగాడు. బావ కాదనేశాడు. ఇప్పుడేమో నన్ను సిఫా

రసు చెయ్యమంటున్నాడు. నేనూ నావల్ల కాదనే శాన్లే.

చిన్న: మంచిపని చేసినారు బాబూ!

గజ: ఏంరా, అలా అంటున్నావు?

చిన్న: ఇట్లాంటోడిని వుద్యోగంలో చేర్చుకుంటే, రెండు రోజుల్లో అంతా నాశనమైపోదూ బాబు!

గజ: ఏం? అంత చెడ్డవాడా?

చిన్న: ఆమాట మెల్లిగా అంటున్నారు. బైటికి పెద్దమనిషిలా కనిపిస్తాడేగాని బాబూ, యితను చేసే దురమార్గాలు యిన్నీ అన్నీ కావు. ఇతనంటే, ఈ వూర్లో పెతీ నోడూ జడుస్తాడు.

గజ: నాకు యివన్నీ తెలీవురా చిన్నయ్యా! మంచివాడే అనుకున్నాను.

చిన్న: మీా కీ యివరాలన్నీ యెట్లా తెలుస్తాయి లెండి. ఈ వూరా యేమా?

గజ: మంచిమాటలమీాద, నా దగ్గర సిగరెట్ కూడా కొట్టుకుపోయాడురా!

చిన్న: అంతటితో చాలించాడు సంతోసించండి బాబూ! మాట్లాడినట్లే మాట్లాడి, పర్సులుకూడా కొట్టుకు పోతాడు. ఈతని సంగతి మార్కెట్టులో మహాజోరుగా సెప్పుగుంటారు బాబూ!

గజ: పోనీలేరా! ఉద్యోగం యివ్వటంలేదుకదా. అతడెట్లాంటివాడైతే మాత్రం మనకేం?

చిన్న: అంతేబాబూ...అంతే! (లోపలికి పోయేందుకు ముందుకు అడుగు వేస్తాడు]

గజ : చిన్నయ్యా!

చిన్న: బాబూ!

గజ : రామంవాళ్ళ నాన్నగారు యింకా రాలేదేంరా?

చిన్న: అమ్మాయిగారికి యింకా నయంకాలేదట...మరో వారంరోజులపాటు అక్కడే వుంటారని శాంతమ్మ గారు సెప్పినారండీ.

గజ : అంటే అంతవరకూ యీ రామం యిక్కడే మకాం పెడతాడన్నమాట!

చిన్న: మరెక్కడికి పోతారండీ, తాతగారిల్లుకదా! పెద్దబాబుకూడా శానా మంచోరు బాబూ! రామంబాబంటే ఆయనికి పేణం. రామంబాబుకూడ శానా నెమ్మదండీ. అందరి దగ్గరా మంచిగానే వుంటారు

గజ : అదంతా నటనరా చిన్నయ్యా!

చిన్న: (వుత్సాహంగా) ఔనుబాబూ ! ఔను. రామం బాబు నాటకాల్లో యేసాలుకూడా యేస్తారండీ ! ఆయన యేసంయేసిన నాటకం నానూ ఒకటి చూశా న్లెండి. అందులో యెంతచక్కగా ఒప్పించినారండీ !

గజ : (కోపంగా) ఇక నీ వాగుడు కట్టిపెట్టరా.

చిన్న: చిత్తం (లోనికి పోతాడు)

[గజపతి సిగరెట్ ముట్టించి, ఆలోచనల్లో మునిగి పచారు చేస్తుంటాడు. శాంత లోపల్నుంచి వస్తుంది]

శాం : ఇక్కడ పత్రిక వుండాలి యేది మామయ్యా ?

గజ : (ఓరగా ఆమెవేపు చూసి) ఏమో, నాకేం తెలుసు? బహుశా మీ నాన్నగారు లోపలికి తీసుకుపోయారేమో! ఏఁవిటో యిప్పుడు నీకీ శ్రద్ధ? కొంపదీసి రాజకీయాల్లో ప్రవేశం తీసుకుని లీడరువైపోవుగదా!

శాం : (కోపంగా చూసి) ఆ! అవుతాను, అప్పుడు నీ పని పట్టిస్తాను.

గజ : అదేం ఖర్మమోగానీ, ఒక్కనాడుకూడా నాతో మందహాసంతో మాట్లాడవుకదా! నన్ను చూస్తేనే కళ్ళెర్రజేసి బుసలుకొడతావు. అందులోనూ యిప్పుడు మరీను. అవసరమైనవాళ్ళు అందుబాటులో వుంటే, యింక మాలాంటివాళ్ళు కంటికి కనిపిస్తామా?

శాం : (కళ్ళెర్రజేసి) ఏవిఁటి నీ వుద్దేశం?

గజ : (తడబడి) అబ్బే! ఏవీఁలేదు.

శాం : రోజుకిరోజూ నీ ప్రవర్తన హద్దులు దాటుతోంది మావఁయ్యా! ఇలా అవుతే మర్యాద దక్కదు. నువ్వనుకుంటున్నావు మా అమ్మ నీపక్షంవహిస్తుందని; కాని, అవసరమొచ్చిందంటే యెవర్నీ లెక్కచెయ్యను. ఇకనుంచయినా నోటిమంచితనం అలవర్చుకో! (లోపలికి పోబోతుంది)

గజ : (ఆమెకు అడ్డంగాపోయి) ఎందుకు శాంతా, అంత వుద్రేకం తెచ్చుకుంటావు? ఏదో పరిహాసానికి అన్నానంతే! నిజంగా కోపంవచ్చినపుడుకూడా నీమొహం మెరుగుపెట్టిన మేలిమి బంగారంలా మిలమిల మెరిసి పోతుంటుంది సుమా!

శాం : (అసహనంతో) నువ్వు పిచ్చాసుపత్రిలో చేరితే బావుంటుంది మావయ్యా. (తప్పుకుని చరచరా లోపలికిపోతుంది)

(గజపతి పెద్దగా నిట్టూర్చి కుర్చీలో కూలబడి పోతాడు. శివం బయటనుండి వస్తాడు.)

శివం : (వస్తూనే నవ్వుతూ) వెల్లవేసినట్లు నీ మొహం తెల్లగా వుందేవిఁటి మావయ్యా!

గజ : ఏవీఁలేదోయ్ (ప్రసంగం మార్చాలని) అన్నట్టు యేవిఁటోయ్ శివం. మీ బావని జేబులోపెట్టు కున్నట్టు అలా అంటిపెట్టుకు తిరుగుతున్నావు ?

శివం :(నవ్వి) లేకపోతే, నిన్ను జేబులో పెట్టుకు తిరగమం టావా యేవిఁటి? నువ్వు జేబులో పట్టవుగానీ, లేకుంటే నాకేమీ అభ్యంతరంవుండకపోను.

గజ : (చిన్నబుచ్చుకుని) నోటికొచ్చినట్టు మాట్లాడం, మీ యింట్లోవాళ్ళకి వుగ్గుతో పెట్టిన విద్యలా వుంది చూస్తూంటేను !

శివం : ఓ! అలా చెప్పు... ఇప్పు డర్థమయ్యింది.

గజ . ఏవిఁ టా అర్థమయ్యింది?

శివం : ఏముంది? శాంత మళ్ళీ నీ మీద నోరుపారేసుకుని వుండివుంటుంది. అందుకే తమరి మొహం అలా కళావిహీనంగా వుంది.

గజ : నీవూహ తప్పు. ఇప్పు డెందుకు నోరుపారేసుకుంటుంది? ఆమెజోలికి పోతేగా!

శివం : (వెటకారం ధ్వనించేలా) అంత బుద్ధిమంతుడి వయ్యావా మావయ్యా!

గజ : (చిరుకోపంతో) చెప్పానుగా మీ నోటికి హద్దు వుండదని.

శివం : అది మీనుండే మాకూ సంక్రమించివుంటుంది.

గజ : ఏవిటోయ్ ఆ మాటలు?

శివం : ఇందులో తప్పేముంది? నిజం చెప్తున్నా!

గజ : మానుండి సంక్రమించడమేవిటి? పైగా నిజం చెప్తున్నా నంటావు...నిజం!

శివం : మా అమ్మకి నోటిదురుసు అధికమని చెప్తే, నువ్వు నమ్మవు. అయినా, మా అందరికీ అనుభవమే! ఆ వారసత్వమే మాకూ సంక్రమించిందనుకో!

గజ : నీతో నాకు వాదనెందుకూ; ఈ విషయం మీ అమ్మతో చెప్తానుండు.

శివం : చెప్పుకో! నాకేంభయం? నేనలా అన్నానని సాక్ష్యం యేదీ? (నవ్వుతూ లోపలకు పోతాడు)

(సరిగ్గా అదే సమయానికి రామం బైటినుండి వస్తాడు. అతన్ని చూచి గజపతి మొహంచిట్లించుకుని లోపలికి పోతాడు. రామం నిట్టూరుస్తూ నీరసంగా కుర్చీలో కూలబడతాడు. అప్పుడే శాంత యింట్లోనుండి వస్తుంది.)

శాం : [దగ్గరగా వచ్చి] ఎంతసేపయ్యింది బావా వచ్చి?

రా. : ఇప్పుడే వచ్చాను శాంతా!

శాం : అంత నీరసంగా మాట్లాడుతున్నా వేవిటి?

రా : జీవితమే నీరసంగా వున్నప్పుడు, ఇంక మనిషికీ మాటకీ లెఖ్కేవిఁటి శాంతా ?

శాం : (నవ్వి) ఈ వేదాంతం యెప్పట్నుంచి అలవర్చుకుంటున్నా వేవిఁటి బావా ?

రా : వేదాంతం కాదు శాంతా! వున్నవిషయం చెప్తున్నా! నిజంగా నా జీవితం నిర్జీవంగానే సాగుతోంది.

శాం : అలా నిరాశపడి దిగులుపెట్టుకుంటే యెలా ? ధైర్యం కూడకట్టుకోవాలిగాని.

రా : అదెలా సాధ్యం శాంతా ! ఎటుచూసినా, అంధకారమే !

శాం : ఆ అంధకారంతోనే కాంతికిరణాలు వుద్భవిస్తాయని యెందుకు నమ్మవు బావా ? చీకటి లేకపోతే, వెలుగన్న పదానికి అర్థమేలేదు. అవుతే, మనలో కాస్త ఓపిక్కితోడు ఆశవుండాలి.

రా : నా జీవితంలో వెలుగు ప్రవేశిస్తుందన్న నమ్మకంలేదు.

శాం : అది నువ్వూ నేనూ చెప్పాల్సిన విషయంకాదు. అనుభవంలోకి వస్తేనేకానీ యేదీ మనం చెప్పలేం.

రా : నాకంటే, నువ్వే నయం శాంతా ! నీలో ఆశ అంటూ ఒకటివుంది. ప్రస్తుతం నాలో నిండివున్నదంతా నిరాశే !

శాం : అదే వుండకూడదు బావా ! బొత్తిగా నిరాశావాదులమైతే యీ భయంకర జీవితాన్ని భరించలేం. ఆశ కాస్తవుంటేనే జీవించాలన్న ఆకాంక్ష మమత వుంటాయి.

రా : శాంతా ! యింత పరిజ్ఞానం నీకు యెలా అబ్బింది ?

శాం : అందులో విశేషమేముంది ? పుస్తకాలనుండి నేర్చుకున్నదే !

రా : (బాధ వ్యక్తంచేయకుండా) నిజంగా, నీలాంటి వ్యక్తిని భార్యగా పొందబోతున్న మీ మేనమామ అదృష్టవంతుడు సుమా !

శాం: (చకితయై) ఎవరు చెప్పారు బావా నీకు యీ విషయం?

రా ; శివం...

శాం : ఇంకేమైనా చెప్పాడా ?

రా : చెప్పాడు కాని, వాటికి నే నంత విలువివ్వలేదు.

శాం : ఏం ? ఎందుకు విలువివ్వలేదు ?

రా : అవి అధికారాలముందు తలవొగ్గుతాయిగాబట్టి. అల్లాంటివాటికి విలువనివ్వటంలో అర్థంలేదు.

శాం : నువ్వు పొరబడ్డావు బావా ! అధికారాలముందు తల వొగ్గేటంత బలహీనురాలను కాను. నాకూ వ్యక్తిత్వం వుంది. నా మనోనిర్ణయానికి వ్యతిరేకంగా యెవరు ప్రయత్నించినా తప్పక యెదిరిస్తాను. నేను పూర్తిగా నాశనమైపోయే పరిస్థితులు సంఘటిల్లినా తలవొగ్గను. మావయ్యను పెళ్ళిచేసుకోవటం యీ జన్మలో అసంభవమనుకో !

రా : (ఆసక్తిగా) మ రెంకెవర్ని పెళ్ళిచేసుకుంటావు ?

శాం : (సిగ్గుతో) నాకు యిష్టమైనవాళ్ళని.

రా : అదే, యెవరో కాస్త చెప్పకూడదూ ? విని సంతోషిస్తాం !

శాం : (సిగ్గుతో తలవంచుకొని) అబ్బ ! పోనిద్దూ బావా !

రా : సరేలే; చెప్పొద్దులే కాని, ఒక్కటాలోచించావా ? నువ్వు యిష్టపడిన అబ్బాయిని మీ అమ్మ యిష్ట పడకపోతే అప్పుడేం చేస్తావ్ ?

శాం : అందుకే చెప్పానుగా – యెదిరిస్తానని. అయినా నాన్న నా పక్షం వుంటాడని ధైరంగా వుందిలే.

రా : శాంతా! నువ్వేదో అందరాని – ఆశలు పెట్టుకుంటు న్నావు...వద్దు. అనవసరంగా నీ జీవితంలో తుఫాను కోరి తెచ్చుకోకు. మీ అమ్మ యెలా చెబితే, అలానే వినటం మంచిది.

శాం : [విస్తుపోయి] నువ్వూ అలాగే అంటున్నావా బావా?

రా : మనమంతా పరిస్థితులకు బానిసలమే శాంతా!

శాం : [బాధతో] నువ్వూ నన్ను నిరుత్సాహపరుస్తావనుకో లేదు బావా? నువ్వన్నట్టు, నే నెన్నో ఆశలుపెట్టు కుని వున్నాను. కాని, అవి అందరానివేం కావు. అన్నీ చేరువలోనే వున్నాయి. బావా! నా నోట చెప్పించా లని నీ వుబలాటంగానీ, నీకు మాత్రం తెలీదూ, నా ఆశలన్నీ నీమీదే వున్నాయని? ఏనాడో నా హృద యాన్ని నీకు అంకితంచేశాను. అల్లాంటిది యిప్పుడు మావయ్యను పెళ్ళిచేసుకుని నా జీవితాన్ని సర్వ నాశనం చేసుకోమంటావా ?

రా : నువ్వన్నది నేను కాదనలేను శాంతా ! కాని మీ అమ్మకు యిష్టంలేని మన పెళ్ళి జరిగినా, మనం

యేం సుఖంగా జీవించగలం చెప్పు? పగబట్టిన త్రాచులా మీ మావయ్య మనల్ని వెంబడించడా?

శాం: అవుతే నువ్వు ముఖ్యంగా మావయ్యకి భయపడుతున్నావన్నమాట?

రా: భయపడికాదు శాంతా! మన యిరువురి శ్రేయస్సుకోరే చెబుతున్నాను. నువ్వు నన్ను అపార్థంచేసుకోకు. స్త్రీవ్యామోహం మనుషుల్ని యెంతగా దిగజార్చి పశువులుగా మార్చేస్తుందో, నువ్వా కొంతవరకు పుస్తకాలనుంచి తెలుసుకునే వుంటావు. ఒక్క స్త్రీ కోసం రాజ్యాలు పోగొట్టుకుని, రాజరికం, చివరికి జీవితాన్ని సహితం మంటగలుపుకున్నవాళ్ళెంతో మంది వున్నారు. ఒక్క వనితకోసం, వందలాది హత్యలు జరగడం చరిత్రకు క్రొత్తకాదు. ఆ వ్యామోహం అల్లాంటిది శాంతా! ఎందుకు చెప్పు యీ అనర్థాలకు ఆస్కారమివ్వడం?

శాం: (బాధగా) నీ ధోరణి చూస్తుంటే నిజంగా నువ్వు నన్ను ప్రేమించటంలేదని తెలిసిపోతూనేవుంది. ఇన్నాళ్లూ ప్రేమించినట్టునటించి, నన్ను వంచించావు.

రా: శాంతా!

శాం: ప్రేమ వున్నచోట భయం వుండదు. నువ్వు నిజంగా నన్ను ప్రేమిస్తే, యింతగా భయపడేవాడివి కాదు. సరేలే బావా! (బాధతో) నువ్వు సలహాయిచ్చినట్టు మావయ్యనే పెళ్ళిచేసుకుంటాను. ఆ వరకు మేదో

నేనే అనుభవిస్తాను. అప్పుడు నువ్వు మనసారా ఆనందించు. (పోబోతుంది)

రా : (చప్పున ఆమె చేయి పట్టుకుని) నన్ను అపార్థంచేసుకుంటున్నావు శాంతా! నేను నిన్ను యెంత గాఢంగా ప్రేమిస్తున్నానో నీకు యెలా తెలియచెయ్యడం? ఎవరూ ఇంతవరకూ ఆకర్షించలేని నన్ను ఆకర్షించింది నువ్వే. నా కళ్ళల్లో, నా హృదయంలో, నా మస్తిష్కంలో యెప్పుడూ నువ్వే మెదుల్తూ వుంటావు. కాని... కాని...

శాం : పరిస్థితుల్ని యెదిరించే ధైర్యం లేదంటావ్. అంతేనా?

రా : ఔను.

శాం: ధైర్యంలేని పిరికివాళ్ళు అసలు ప్రేమించనేకూడదు బావా!

రా : (దెబ్బతిని) అనవసరంగా ఆవేశం తెచ్చుకోకు శాంతా! నీకు నచ్చచెప్పడం నాతరంకాదు. (ఆగి) సరే... నీ అభిమతమే కానీయ్. జీవితరంగంలో అడుగడుగునా అపజయాన్నే కౌగిలించుకుంటున్న నాకు, యిందులోకూడా అపజయం యెదురైనా ఒక లెఖ్ఖలోదికాదు. పరిస్థితుల్నే యెదిరిద్దాం. ఎన్ని కష్ట, నష్టాలొచ్చినా సహించుదాం...

(బైట 'టెలిగ్రాం సాబ్' అన్న కేక విన్పిస్తుంది)

రా : (చలించిపోయి) టెలిగ్రామ్! ఎవరికి? నాకేనా? (ఆతృతగా బైటకు వెళ్తాడు. చేతిలో టెలిగ్రామ్‌తో తిరిగివస్తాడు.) శాంతా! పద్మ మరిలేదు శాంతా! మరి

లేదు. మనల్ని విడిచిపెట్టిపోయింది. (బాధపడుతూ కుర్చీలో కూలబడిపోతాడు)

శాం : (రుద్ధకంఠంతో) ఆఁ ! పద్మ చనిపోయిందా ! ఎంత ప్రమాదం జరిగింది? నాన్నా, నాన్నా!

వెం : (లోపల్నుంచి వస్తూ) ఏం అమ్మాయ్! ఏంజరిగింది ? అదేవిట్రా రామం; అలా కుమిలిపోతున్నావు ? ఏవిటది ?

శాం : పద్మ చనిపోయింది నాన్నా ! టెలిగ్రామ్ వచ్చింది.

వెం : ఆఁ! పద్మ చనిపోయిందా ? (రామంచేతిలోని టెలిగ్రామ్ తీసుకుని చూస్తాడు. అతనికళ్ళు ఆర్ద్రమౌతాయి)

రా : (రుద్ధకంఠంతో) నా జీవితానికి మరో పెద్ద ఘాతం తగిలింది. ఉన్న ఒక్క తోబుట్టువు పోయింది. నేనంటే యెంతో అభిమానం పద్మకి. పద్మా ! చనిపోయే ముందు నిన్ను ఒక్కసారైనా కళ్ళారా చూశాను కాదమ్మా ! (మొహం చేతులమధ్య వుంచుకుని కుమిలిపోతాడు)

వెం : (కన్నీరు ఒత్తుకుంటూ) అలా విచారిస్తే మాత్రం ప్రయోజనం యేముందిరా రామం ? పద్మకి యీ ప్రపంచంతో అవసరం తీరిపోయింది. ఆయుష్షు నిండింది. విధిని మనం యెదిరించగలమా చెప్పు ? ధైర్యం తెచ్చుకో ! నువ్వే యిలా దిగులుపడి, దిగజారిపోతుంటే, నాన్న సంగతి ఆలోచించు...అతను

మరీ కృశింపోతాడు. ఇల్లాంటి సమయాల్లోనే గుండెల్ని రాయిచేసుకోవాలి.

రా : (రుద్ధకంఠంతో) ఆఖరిసారిగా పద్మను మరి చూడలేక పోయాను మావయ్యా! నాన్నతోపాటు నేనూ వెళ్ళినా చూచివుండేవాణ్ణి!

వెం : పిచ్చివాడా! నువ్వు వెళ్ళిమాత్రం యేంచేస్తావు? ప్రాణదానం చేస్తావుట్రా! ఇవన్నీ మన సంతృప్తికోసం అనుకునేవే! అంతా మిథ్య!

రా : ఆ సంతృప్తిఅయినా మిగిలేది మావయ్యా! ఇప్పుడా బాధ నన్ను రగిల్చేస్తుంది.—నీపట్ల నేను చాలా అన్యాయం చేశాను చెల్లీ!

వెం : గుండె దిటవుపర్చుకోమని చెప్తున్నానా మరి?

రా : అది నా తరంకాదు మావయ్యా! ఈవేళే అక్కడికి బైలుదేరి పోవాలి.

వెం : సరే! అలాగే వెళ్దాం... లోపలికి పద...

[రామంని తీసుకుని లోపలికి పోతాడు. వారివెంట శాంత పోతుంది]

[తెర పడుతుంది]

# నిమిత్తమాత్రులు

## 4 వ దృశ్యం

[రంగాలంకరణ మూడవరంగంలానే వుంటుంది. శివం కుర్చీలో కూచుని, నాటికలో తనకిచ్చిన పోర్షను చదువుతూ వుంటాడు. తల్లి వస్తుందని భయంగా మోసు, అప్పుడప్పుడు పక్కచూపులు చూస్తుంటాడు. అంతలో గజపతి లోపల్నుంచి వస్తాడు. పద ధ్వని విని 'శివం' పుస్తకం మడిచివేస్తాడు. గజపతిని చూసి ధైర్యం తెచ్చుకుంటాడు.]

శివం : నువ్వేనా మావయ్యా! (పుస్తకం విప్పుతాడు)

గజ : [సోఫాలో కూచుని] ఏవిటోయ్. అంత శ్రద్ధగా చదివేస్తున్నావు?

శివం : ప్రతీదీ నీతో నివేదించుకోవాలా ఏవిటి మావయ్యా!

గజ : ఎందుకోయ్ అలా చీదరించుకుంటావు? ఇష్టంలేకపోతే చెప్పనవేయరాదూ?

శివం : అలా యెందుకంటానుగాని, నువ్వు అడక్కుండా వుంటేనే బావుంటుందని నా భావం. ఇంతకీ, నువ్వు అడిగావు గాబట్టి, చెప్పాల్సిన బాధ్యత నామీద వుందిగాబట్టి చెప్తున్నాను. ఇది నాటికలో పోర్షను.

గజ : (వెటకారంగా) ఓహో! ఇందులోనూ ప్రవేశించావా నాయనా? ఇలాగే చదువు సాగకుండా వుంది. ఇక, ఈ నాటకాలగొడవల్లో పడితే వేరే చెప్పాలా?

శివం : నా గొడవ నీకు యెందుకు మావయ్యా?

గజ : రక్తసంబంధీకుణ్ణి, స్వయానా మేనమామను! ఆపాటి అభిమానం వుండదూ మరి! నువ్వు చెడుత్రోవలు పడుతూవుంటే, చూస్తూ ఘాకుకుంటానా? ఈ విషయం మీ అమ్మతో చెప్పాలి.

శివం : (రాజీపడకపోతే లాభం లేదనుకొని) మావయ్యా, నీకు పుణ్యముంటుంది. అమ్మకు మాత్రం చెప్పకు. అమ్మనోట్లో పడిందంటే, తప్పకుండా నాన్నతో చెపుతుంది. ఇక, నా పరువు దక్కదు. ఇద్దరూ కలసి నాలుగు హారతులు పాడేస్తారు. నేనీ నాటకరంగానికి స్వస్తి చెప్పకోవాల్సిందే! రామంబావ ధర్మమా అని, యిన్నాళ్ళుగా కంటున్న కలలకి ఒక రూపం యేర్పడిం దిప్పుడు. నువ్వు పానకంలో పుడకలా విఘ్నానికి పూనుకుని నా భవిష్యత్తుని పాడుచేస్తావా?

గజ : ఓహో! ఇది మీ బావ ప్రతాపమా! అలా చెప్పు. ఆయన చెడుతున్నది కాకండా నిన్నూ చెడగొడు తున్నాడన్నమాట?

శివం : (కోపం ఆపుకుని) ఆయ నేం చెడ్డాడు? నన్ను చెడ గొట్టడమేమిటి; ఏమిటి మావయ్యా నువ్వంటున్నది?

గజ : నాటకాల్లో వేషాలు వేసేవాళ్లు యెవరన్నా బాగుపడ్డా రటోయ్? నీకు తెలీకపోతే యేమోగాని, నాకు

తెలిసినంతవరకు ఒక్కరూ బాగుపళ్ళేదు. మీబావకీ నాటకాల్లో సరదావుంది గామోసు. నిన్నా ఆ వ్రాబి లోకిదింపేశాడు. తాచెడ్డకోతి వనమంతా చెరిచిందట.

శివం : (నవ్వి) ఆవ్రాబిలో నువ్వు కూరుకుపోయి, పైకిరాలేక అవస్థపడుతున్నట్టు కబుర్లు చెప్తావేం మావయ్యా! నా అవస్థ యేదో నేనుపడతానుగా.

గజ : నిజమే అనుకో; కాని, నువ్వు చెడిపోకండా రక్షించే బాధ్యత నాకుమాత్రం లేదూ?

శివం : నీ అభిమానానికి చాలా ధన్యవాదాలు మావయ్యా! అసలు, నీకు మా అందరిమీద అంతులేని అభిమానం. అంత అభిమానం వున్నవాడివి గనుకనే, యీడూ జోడూ వుండదని తెలిసికూడా శాంతని వివాహంచేసుకోవాలని ప్రయత్నిస్తున్నావు. ఇది అభిమానం కాక మరేమౌతుంది?

గజ : (చిరుకోపంతో) శివం! తలకుమించిన విషయాలలో తలదూరుస్తున్నావు.

శివం : (వెటకారంగా నవ్వి) ఔను; మరిచాను. నేను పన్నెండేళ్ళ కుర్రాణ్ణి కదూ! ఇది నాకు తలకు మించిన విషయమే.

గజ : (పౌరుషంగా) నేనేమీ మీ చెల్లెల్ని పెళ్ళిచేసుకోవాలని ప్రయత్నించలేదోయ్. మీ అమ్మా, నాన్నే నన్ను బ్రతిమాలుతున్నారు.

శివం : అలాగా! పాపం! నువ్వు మా శాంతను పెళ్ళిచేసుకోకపోతే, ఆమెకి మరి వరుడు దొరకడుకదూ.

ప్రపంచం గొడ్డుపోయింది. ఈ కబుర్లు నా దగ్గర చెప్పకు మావయ్యా! మా అమ్మను మంచిచేసుకుని ఆటలాడాలని చూస్తున్నావుగాని, నీ ఆటకట్టించే యేర్పాటు మేమూ చేస్తున్నాం.

గజ : ఔను; ఎందుకు చెయ్యరూ? ఇంట్లో చేరాడుగా ఓ బడుద్ధాయి వేషాలమారి! అతనికి తెలియని యుక్తు లుంటాయా? మీ చెల్లాయిని యేనాడో వలలోవేసుకుని ఆమె మనసు తిప్పేసుకున్నాడు.

శివం : (లేచి) మాటలు సవ్యంగా రానియ్ మావయ్యా! నువ్వాయిపోయావుగాని, మరోహడైతే పళ్ళూడేవే. ఆరోజు చెల్లాయి కోపగించుకుందంటే, కారణం లేక పోలేదు. ఇలాగే పేలివుంటావు!

గజ : ఎవరికోయ్ యీ బెదిరింపులు? మీ చేత ఈ మాట లన్నీ పడేందుకు, నేనేం గతిలేక మీ యింట్లో వున్నాననుకున్నావా?

శివం : లేకపోతే యేమిటి? మేం 'ఛీ' అంటున్నాసరే సిగ్గు లేకుండా యిక్కడే పడివున్నావు. మళ్ళీ పెద్ద బోడి కబుర్లు చెప్తున్నావు.

గజ : (వుక్రోషంతో లేచి) శివం ! ఏమిటా మాటలు? హద్దులు దాటుతున్నావు.

శివం : హద్దులు దాటుతోంది నేను కాదు నువ్వే! ఇకనైనా బుద్ధితెచ్చుకుని ప్రవర్తించు. (చరచరా బైటికి పోతాడు)

(గజపతి విసుగ్గా పచార్లుచేస్తుంటాడు. నరసయ్య బైటనుండి వస్తాడు)

నర : (వస్తూ) నమస్కారమండీ!

గజ : (ఆగి) ఓ! మీరా...రండి కూచోండి.
(ఇద్దరూ కూచుంటారు)

నర : అలా వున్నారేవండీ? మీ మొహం చూస్తుంటే యేదో చికాకులోచిక్కుకున్నట్టుగా అగుపిస్తున్నారే!

గజ : అబ్బే! యేమీలేదు.

నర : మీ బావగారు ఫ్యారికెళ్ళారుగా; ఎప్పుడొస్తారేవిటి?

గజ : ఈవేళో రేపో వచ్చెయొచ్చు.

నర : ఆ అబ్బాయికూడా వచ్చేస్తాడు కదూ?

గజ : అదే నేనూ అనుకుంటున్నాను.

నర : మాంచి సమయంలో అతను ఫ్యారికి వెళ్లిపోయాడండీ! లేకపోతే, యీసరికి చచ్చి యేలోకంలో వుండే వాడో! ఇప్పటికైనా మించి పోయిందేమీలేదు లెండి; వచేస్తాడుగా! మనం యెప్పుడూ రడీగానే వుంటాం.

గజ : (చుట్టూచూసి) ఆఁ.... ఆఁ... అంతే....కాస్త మెల్లిగా మాట్లాడండి.

నర : ఒక చిన్న అవసరంమీద వచ్చానండీ మీదగ్గరికి.

గజ : ఏవిటది?

నర : మీరేమైనా సర్దుబాటుచేస్తారని?

గజ : ఏవిటి సర్దుబాటు చెయ్యడం?

నర : డబ్బండీ!

గజ : మొన్ననే యిచ్చాను కదండీ! ఇప్పుడు మళ్లీ తెమ్మంటే యెట్లా? నా యింటినుండికూడా యింకా డబ్బురాలేదు. మా అక్కయ్యనడిగితే యివ్వకుండా వుంది. ఈ ప్రయత్న మేదో సఫలంకానిద్దురూ, తర్వాత యిస్తాను.

నర : సఫలంకాక యేం చేస్తుందండీ! ఈ నరసయ్య తలచు కున్నాడంటే తిరుగుండదు. మనతడాఖా మీకు తెలీదు. తెలుసుకోవాలంటే, వ్వాళ్లో అడగండి చెప్తారు.

గజ : [అయిష్టంగా] అయినా, ప్రతీసారి యిలా డబ్బు అడగటం యేం బావుంది చెప్పండి;

నర : మీరు దూరంగా ఆలోచించండి. మీరు నాకు అప్ప జెప్పిన పని అసాధ్యమైనది. అది స్వయంగా నేను చెయ్యను? ఇంత మర్యాదగా నలుగుర్లో మసల్తూ, నే నా పని చేస్తానా చెప్పండి? నా అజమాయిషీలో ఒకగుంపు వుంది. వాళ్ళకి నేనూ డబ్బిచ్చుకోవాలా మరి?

గజ : (విసుగుతో) ఇంతకీ యిప్పు డెంత కావాలంటారు ?

నర : ఓ యాభై యివ్వండి. తర్వాత చూచుకుందాం.

గజ : (షాక్ తిన్నట్టు చప్పునలేచి) యాభయ్యే! డబ్బు అంత తేరగా వస్తుందనుకున్నారా?

నర : (అదోలా నవ్వి) ఒక మనిషిప్రాణాలు నిలువునా తియ్యడమంటే, మాటలతో పననుకున్నారా? లేక పోతే, ప్రాణానికేం విలువలేదనుకున్నారా?

గజ : (బెదిరిపోయి) కాస్త మెల్లిగా మాట్లాడండి నరసయ్య గారూ. ఆఁ...ప్రస్తుతానికి నేనేమీ యివ్వలేనండీ ! తర్వాత చూస్తాను.

నర : (కటువుగా) ప్రస్తుతానికి మీరు చెప్పిన పని నేనూ చేయలేనండీ.

గజ : (కోపంగా) అలాగవుతే నేనుముందిచ్చిన డబ్బుతిరిగి యిచ్చేయండి.

నర : (వికటంగానవ్వి) నాతోనే ఆటలాడాలనుకుంటున్నా రేమిటండీ! చాలాప్రమాదం....నిప్పుతో చెలగాట మాడినట్టే. ఒక్కసారి ఆలోచించుకోండి. (మీసం మెలివేస్తాడు)

గజ : (లాభంలేదనుకొని)చూడండి నరసయ్యగారూ! మనం తగువుపడినందువల్ల ప్రయోజనం యేమీలేదు. మీరు నా కా డబ్బు తిరిగి యివ్వనవసరంలేదు. ప్రస్తుతానికి మీ రేమీ నాకుసహాయం చెయ్యొద్దు. అవసరమైతే నేను డబ్బిస్తాను. అప్పుడే ఆ పని చేద్దురుగాని.

నర : అలా అన్నారూ శావుంది (గజపతికి దగ్గరగాపోయి) మళ్లీ మనసుమార్చుకున్నా రేం? పరిస్థితులు మీకు అనుకూలంగా వచ్చేశాయేవిటి?

గజ : లేదు గాని, యింట్లోవాళ్ళంతా నాకు ప్రతిపక్షంగానే వుంటున్నారు. అందువల్ల, మనం యీ ప్రయత్నం యీ విషమపరిస్థితుల్లో చేశామంటే, మన కేముప్పు. మరికొద్దిరోజులు చూద్దాం.

నర : మీరు యేమైనా సహాయంచేస్తారని గంపెడాశతో వచ్చానండీ! చివరికి వట్టిచేతుల్తో వెళ్ళడమవుతోంది. డబ్బు చాలా అవసరం వుందండీ. పోనీ, అయిదు రూపాయిలైనా యివ్వండి.

గజ : (పీడ వదిలించుకోవాలనుకుని జేబునుండి పర్సుతీసి అందులోనుండి రెండు రూపాయలనోటు తీస్తాడు) ఇప్పటికి యీ రెండు రూపాయలు తీసుకెళ్ళండి.

నర : (తీసుకొని) సరేలెండి, యెంతోకొంత. వస్తా మరి... అవసరమైతే, కాకిచేత కబురు పంపించండి. వచ్చి వాల్తాను.

గజ : (కోపంగా) మరి మీ అవసరం వుండదులెండి. మీ రిక వెళ్ళొచ్చు.

(నరసయ్య క్రోధంతో కళ్ళురిమి గజపతి వేపు చూచి విషపునవ్వు నవ్వి వెళ్ళిపోతాడు. గజపతి పచారు చేస్తుంటాడు. అంతవరకూ పొంచివుండి అంతా విన్న శాంత లోపల్నుంచి రాబోయి మళ్ళీ వెనక్కి తగ్గి పోతుంది)

గజ : (స్వగతం) డబ్బు! డబ్బు! డబ్బు! డబ్బుగలవాడినైనా ప్రస్తుతం జేబులో పదిరూపాయలైనా లేకుండా పోయాయి. అమ్మకి టెలిగ్రామ్ యిచ్చినా పంప లేదు...డబ్బంటే ఆవిడికి రెండోప్రాణం. ఇక అక్కయ్య నడిగితే మొండిచెయ్యి చూపించింది. ఔను మరి! ఎంతని యిస్తుంది! ఇటు – యీ నరస య్యగాడొకడూ, పీక్కుతింటున్నాడు. వీడి దురాశ

గానీ, వందలు కావాలిట...వందలు! వీడితో తగవు తెచ్చుకోవటం యెందుకు! ప్రస్తుతం రామంని చంపించినందువల్ల నాకు ఒరిగేదేమీ లేదు. వట్టి డబ్బు దండగ...హూఁ! (జేబులు తడుముకుని) బుర్ర పాడైన సమయానికే సరిగ్గా సిగరెట్లుకూడా నిండుకుంటాయి, అదేవిటో మరి! (కాస్త గట్టిగా) చిన్నయ్యా! ఒరేయ్ చిన్నయ్యా!

చిన్న: [లోపల్నుంచి వచ్చి] బాబూ!

గజ: ఓ సిగరెట్ పేకెట్ తెచ్చిపెట్టరా!

(రూపాయినోటు అందిస్తాడు)

చిన్న: కొట్టు దూరం బాబూ! ఆలిస్యమవుద్ది తేవడం.

గజ: అధికప్రసంగం నీకు యెక్కువరా. వెళ్లి తీసుకురా. అన్నట్టు చూడు – మిగిలిన డబ్బుల్లో ఓ పావలా నువ్వు తీసుకుని టిఫిను, టీ తీసుకో. చాలారోజుల్నుంచి, నీకేమన్నా యిద్దామని అనుకుంటాను. కాని, యెప్పుడూ వీలుపడకుండా వుంది.

చిన్న: నాకు లంచమెందుకు బాబుగారూ! మీ బావగారు జీతమిస్తున్నారుగా!

గజ: అయినా సరే, మీలాంటివాళ్ళని తృప్తిపర్చాలిరా.

చిన్న: డబ్బుతో మనుషుల్ని కొనేయగలరా బాబూ! (నవ్వుకుంటూ బైటికి పోతాడు)

గజ : (తెల్లపోయి) హరి వీడి తెలివి తెల్లారా! వీడికి యెంత జ్ఞానం వుంది! ఈ యింటి మహాత్మ్యమే అంతగా మోసు!

[అంతవరకూ పొంచివున్న శాంత వస్తుంది. ఆమె మొహంలో కలవరపాటు కనిపించనివ్వకుండా ప్రయత్ని స్తోంది. కళ్ళల్లో కోపం దోబూచులాడుతోంది. పెదాలు వణుకుతూవుంటాయి]

శాం : ఏవిటి మావయ్యా, మహాత్మ్యమంటున్నావు?

గజ : (ఉత్సాహంగా) ఓ...ఓ...నువ్వా! కోరి నువ్వు మాట్లాడుతున్నావంటే, యిక నా అదృష్టం పండింది అన్న మాటే! నా జన్మ తరించినట్టే!

శాం : (చిరుకోపంతో) నే నడుగుతున్న దేవిటీ? నువ్వు వాగుతున్న దేవిటి?

గజ : ఇదిగో, నీప్రశ్నకే జవాబు చెప్తున్నా నా మరి? మరేం లేదు...మీా నౌకరు చిన్నయ్యకూడా యెంత మాటకారి అనుకున్నావు?

శాం : (నిశ్చలంగా) మాటకారి అవటంవల్ల వచ్చేనష్టం యేమీా లేదు మావయ్యా! ప్రమాదం అంతకంటే లేదు. కాని, మంతనాలు జరిపి మాయోపాయాలు పన్నటం అందరికీ ప్రమాదం తెచ్చిపెడుతుంది.

గజ : (చకితుడై) ఏవిటి శాంతా! నువ్వంటున్నది? మంతనాలేవిటి? మాయోపాయాలు యేవిటి? నా కేవీ అర్థంకావటం లేదు.

శాం : అర్థమవటంలేదూ ? నాకు నమ్మకంలేదు. అర్థమైనా యేమీ గ్రహించనట్టు నటిస్తున్నావు.

గజ : (భయంగా) ఏమిటి శాంతా, నువ్వంటున్నది ?

శాం : ఇప్పు డొచ్చి వెళ్ళిన వ్యక్తి యెవరు మావయ్యా?

గజ : ఎవరూ ? ఆఁ... ఆఁ... మనచిన్నయ్య. సిగరెట్లు లేకపోతేనూ పంపించాను.

శాం : చిన్నయ్యకాదు. అంతకుముందు వచ్చి, నీతో మాట్లాడిన మనిషి ?

గజ : (గాభరాగా) నీ కెలా తెలుసు ?

శాం : (అదోలానవ్వి) పిల్లి కళ్ళుమూసుకుని పాలుత్రాగుతూ తనని యెవరూ చూడలేదని భ్రమపడుతుందట. అలా వుంది నీ వ్యవహారం, అంతా నేను పొంచివుండి విన్నాన్లే.

గజ : (షాక్ తిని) విన్నావా ?

శాం : ఔను, అంతా విన్నాను. నువ్వు యింత దుర్మార్గుడవని యెప్పుడూ అనుకోలేదు. పిశాచరులైనా నీకంటె నయం. నీలో మానవత్వం యేకోశానా లేదు.

గజ : (పాశ్చాత్తాపధేయతగా) ఇదంతా యెవరికోసం శాంతా ? నీకోసమే ! (కాస్త ముందుకుపోతాడు)

శాం : అలా మీదకొస్తా వేవిఁటి? అక్కడే ఆగు.

గజ : లేడిపిల్లలా అలా బెదిరిపోతా వేవిఁటి శాంతా ?

శాం : క్రూరమృగాలముందు లేడిపిల్ల బెదరక చేసే దేముంది ?

గజ : అవుతే, నేను క్రూరమృగాన్నంటావు ?

శాం : కనిపిస్తున్న దానికై కొండలెక్కి చూడాలా ?

గజ : కోపం తెచ్చుకోకు శాంతా! నీకోసం, నీ చిరునవ్వు కోసం, నీ చల్లనిచూపుకోసం, యిన్నాళ్లూ నే నిక్కడ వేచివున్నాను. నువ్వు 'ఊఁ' అంటే చాలు–మనిద్దరికీ వివాహం జరుగుతుంది. ఈ దాసుణ్ణి కనికరించు శాంతా !

శాం : (ఉద్రేకంగా) పిచ్చెత్తిందేవిఁటి మావఁయ్యా ? నోరు మూసుకుని కూచోవటం చేతకాకపోతే, వెళ్ళి పిచ్చాసుపత్రిలో చేరు. అంతేగాని, ఇలా పిచ్చిపిచ్చి వేషాలు వేశావంటే పర్యవసానం యెలా వుంటుందో నువ్వే వూహించుకో. (పోబోతుంది)

గజ : (అడ్డంగా నుంచుని) శాంతా! వుద్రేకంలో వున్నప్పుడుకూడా నీ అందం నన్ను ఆకర్షిస్తోంది. నీనుండి నేను కోరేది ఒకే ఒక్కమాట; నన్ను పెళ్ళిచేసుకుంటానను. అది చాలు. నిన్ను పువ్వుల్లోపెట్టి పూజిస్తాను. నా సర్వస్వం నీకే అర్పిస్తాను. నీ ఆజ్ఞల్ని అధిగమించి ఒక్క అడుగు ముందుకు వెయ్యను. హోదా కావాలంటే, నీకోసం నేను వుద్యోగం చేస్తాను. నన్ను తృణీకరించకు శాంతా !

శాం : ఏవిఁటి మావఁయ్యా, నీ పేలాపన ? ఇంకా విజృంభించావంటే, గట్టిగా అరుస్తాను. లే. అడ్డం.

గజ : నువ్విప్పుడు మరీ మారిపోయావు శాంతా! ఆరామం యింట్లో ప్రవేశించిందగ్గర్నించి నీమనసే నీఅధీనంలో

లేకుండాపోయింది. వాడసలు నిన్ను పూర్తిగా స్వాధీనంచేసుకున్నాడు.

శాం : (కోపంగా) మావయ్యా! మాటలు సవ్యంగా రానియ్.

గజ : (వెటకారంగా నవ్వి) ఉన్నమాటంటే, వుడుకుమోత్తనంతోపాటు కోపంకూడా వస్తుందట.

శాం : నోర్మూయ్ (ఛెళ్ళున లెంపకాయ కొడుతుంది)

గజ : (మందహాసంతో దవడ తడుముకుంటూ) ఆహా! ఎంత మృదువుగా వుంది నీ అరచేయి! నువ్వు కొట్టావని నాకు కోపంలేదు శాంతా! ప్రేమకు నాంది యీ ఘట్టమే! నువ్వు యెన్ని మాటలన్నా, యెన్ని లెంపలు వేసినా, నేను భరిస్తాను. నాకు కావల్సింది నువ్వు! నీ ప్రేమ! (రెండడుగులు ముందుకు వేసి) 'ఊఁ...' అను శాంతా!

శాం : ఇక ముందుకడుగు వేశావా మంచిమాట కాదు మావయ్యా!

గజ : (లక్ష్యంచేయక) నీకోసం నేను యెంత త్యాగం చేయదల్చుకున్నానో, యెంత ప్రమాదంలో యిరుక్కోవాలనుకున్నానో, నీకు తెలీందికాదు. ఇంకా, నీకు నామీాద జాలి కలగడంలేదూ శాంతా?

శాం : (ఉక్రోషంతో) జాలి! నీమీాదా జాలి? నీలాంటి రాక్షసుణ్ణా ప్రేమించటం? నీ కపటోపాయ మంతా రచ్చకెక్కిస్తా నుండు...నీ మర్యాద మంటగలుపుతాను...(వెళ్ళబోతుంది)

గజ : (చకితుడై) ఏమిటీ! నామర్యాద మంటగలుపుతావా? (కళ్ళెఱ్ఱజేసి) అందుకు అవకాశం నేనిస్తేగా? నువ్వు నాకు అందని ద్రాక్షపండువైనప్పుడు, నిన్ను యెవరికీ దక్కనివ్వను.

శాం : (విస్తుపోయి) ఏం చేస్తావు ?

గజ : చంపుతాను ... హంతకుణ్ణవుతాను. (ఆమె వేపు అడుగువేస్తాడు. శాంత వెనక్కి తగ్గుతుంది. అతని లోని మానవత్వం చచ్చిపోతుంది. రాక్షసత్వం విజృంభిస్తుంది. తన పన్నుగడ బైటపడుతుందేమోనన్న భయం ఆవరిస్తుంది. రెండుచేతుల్తో ఆమె కంఠాన్ని పట్టుకోవాలని ప్రయత్నిస్తాడు. శాంత వెనక్కి తగ్గుతుంది)

శాం : (భయంగా) ఆగు ! అక్కడే ఆగు...
(గజపతి వికటంగా నవ్వి ఆమెకంఠాన్ని నొక్కిపట్టటానికి ప్రయత్నిస్తాడు. శాంత అరచేందుకుకూడా అవకాశం లేకుండాపోయింది. ఇంతలో 'శివం' బైటి నుండి వస్తాడు. కళ్ళెదుటి దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపోయి, వుగ్రుడైపోతాడు)

శివం : (గట్టిగా) మావయ్యా !
[ఇంతవరకూ అతణ్ణి గమనించని గజపతి తృళ్ళిపడి వాస్తవికప్రపంచంలో పడతాడు. పట్టు విడిచిపెడతాడు. శాంత భయవిహ్వాలయై శివంప్రక్కకి వచ్చేస్తుంది]

శివం : ఏమిటి చెల్లాయ్, యిదంతా ?

శాం : (రుద్ధకంఠంతో) ఏం చెప్ప నన్నయ్యా ! నువ్వు సమయానికి వచ్చావుగాని, లేకపోతే నా శవం చూసే వాడివి.

శివం : ఇంతకీ కారణం యేవిటి ?

శాం : ఎవడో ఒక గాడీవాడితో మంతనాలు జరిపి బావని హత్యచేయించడానికి ప్రయత్నిస్తున్నాడు. వాళ్ళ సంభాషణ నేను పొంచివుండి విన్నాను. అదంతాబైట పెడతానేసరికి, యుక్తాయుక్తజ్ఞానం లేకుండా, తన గౌరవం కాపాడుకొనేందుకు నన్ను యేకంగా యమపురికే పంపాలనుకున్నాడు.

శివం : (పళ్ళు పటపటకొరికి) నువ్వు మనిషివా రాక్షసుడివా మావయ్యా ! మా అమ్మతో బుట్టువని చెప్పుకునేందుకే మాకు తలవంపులుగావుంది. ఛీ ! ... ఛీ ! ! స్వార్థపరత్వంతో వళ్ళు తెలియక స్వంత మేనకోడల్నే హత్యచెయ్యడానికి ప్రయత్నించిన నీలాంటివాడి మొహం చూడనేకూడదు.

[అప్పుడే వెంకటేశ్వర్లు, పురుషోత్తం, రామం వస్తారు. ఆ దృశ్యాన్ని చూసి అర్థంకాక ఆశ్చర్యపోతారు.]

వెం : ఏవిట్రా శివం ? ఏమిటిదంతా ? అలా కొయ్యబొమ్మల్లా నిల్చున్నారేవిటి ?

శివం : (కటువుగా) మీ బావగార్నే అడగండి నాన్నా !

వెం : ఏమయ్యిందోయ్ గజపతీ ?

[అరతలో బయటనుండి నరసయ్య వస్తాడు]

నర : నమస్కారమండీ వెంకటేశ్వర్లుగారూ !

వెం : (వింతగా చూసి) మళ్ళీ మీ రెందుకు వచ్చారు ?

నర : మీరు రావటం చూశాను. మీతో ఓ చిన్న విష యం చెప్పిపోదామని వచ్చానండీ !

[గజపతి నరసయ్య వేపు బితుగ్గా చూస్తాడు. చెప్పొద్దన్నట్టు సౌంజ్ఞ చేస్తాడు. కాని నరసయ్య వినడు]

వెం : ఏమిటా విషయం? (విసుగ్గా) మీతో మాట్లాడుతూ కూర్చునేందుకు నాకు తీరికలేదు, వేగిరం చెప్పండి.

నర : మీ యింట్లో యెప్పటికైనా 'హత్య' జరిగే అవకాశం వుందండీ ! జాగ్రత్తపడమని ముందుగానే హెచ్చరిస్తున్నా.

వెం : (నివ్వెరపోయి) ఏమిటండీ మీరు చెప్తున్నది ? హత్యా !

నర : ఔనండీ ! నాకు తెలిసివుండికూడా చెప్పకపోవటం బావుండదని చెప్తున్నా.

వెం : (ఆత్రుతగా) ఏమిటి తెలిసింది? చెప్పండి వేగిరం ?

నర : మీ మేనల్లు డొకాయన వున్నాడు కదండీ !

వెం : ఔను. ఇదిగో పీడే !

నర : అతణ్ణి చంపాలని ప్లాను వేశారండీ యీ గజపతిగారు.

[అందరూ సంభ్రమంతో గజపతి వేపు చూస్తారు]

రా : (విస్తుపోయి) నన్నా? ఎందుకూ? అతనికి నే నేం అప కారంచేశానని ?

నర : అతను పెళ్ళిచేసుకోవాలని ప్రయత్నిస్తున్న అమ్మా యిని మీరు ప్రేమిస్తున్నారట...అందుకు...

గజ : (కోపంగా) నరసయ్యా ! ఏమిటా పేలాపన ? తాగి వచ్చావా ?

నర : (వెటకారంగా) మీ కళ్ళకి అలాగే కనిపిస్తున్నానా ? ఆయన్ని యెలాగైనా చంపమని నన్ను పురమా యించినపుడు తాగే పురమాయించారా ? లంచం యిచ్చినపుడు తాగే యిచ్చారా ?

గజ : (అసహనంతో) విశ్వాసఘాతకుడివి. నా దగ్గర యింత డబ్బు కొట్టేసి, మళ్లీ చాడీలు చెపుతున్నావా వెధవ ! (నరసయ్యమీదికి వురకబోతాడు. కాని శివం అడ్డుతాడు)

వెం : బావుంది. చాలా బావుంది. స్త్రీ వ్యామోహం యెం తటి దుష్కార్యానికైనా దారితీస్తుందన్న నగ్నసత్యం యిప్పుడు ప్రత్యక్షంగా ఋజువయింది. అంత ధైర్యం నీ కుంది గజపతీ?

శివం : (చప్పున అందుకుని) అదొక విశేషమా నాన్నా? మానయ్య అంతటితో చాలించలేదు. చెల్లాయిపీక నులిమి చంపాలని చూశాడు. సమయానికి నేను రావడం మంచిదయింది.

వెం : (షాక్ తిని) ఏమిటీ ! శాంతను చంపాలని,చూచాడా ! ఎందుకు ?

శివం : మావయ్య యీ నరసయ్యతో మాట్లాడ్డం శాంత విన్నదట. మావయ్యను అడిగింది.ఆమెకి తెలిసినవిషయం యెక్కడ బైటపెడుతుందోనన్న భయంతో, ఆమెనుకూడా అంత నొందించ దల్చాడు.

వెం : (కోపంపట్టలేక) చాలా బావుందోయ్ గజపతీ! నువ్వే స్వయానా బావమర్ది వయ్యావుగాని, లేకపోతే యేం చేసేవాడినో! అవన్నీ యిప్పుడెందుకులే. మీ అక్క దగ్గర శలవుతీసుకోని, యీ యిల్లు తక్షణం విడిచి పెట్టు. నువ్వు యెలాంటి కిరాతకుడివో, మీ అక్కే అర్థంచేసుకోనీ. నీలాంటి పశువుకే శాంతను ముడి పెట్టాలనుకుం దా మూర్ఖురాలు. మళ్ళీ నీ మొహం చూపించకు. పో !

[గజపతి పరాానంగా లోపలికి పోతాడు.]

వెం : నరసయ్యగారూ ! మీరు యీ విషయం తెలియజేసినందుకు కృతజ్ఞులం. మీ యిరువురికీ యేనో మన స్పర్థలు రావటం మా అదృష్టం. లేకపోతే మీ రీ విషయం బైటపెట్టేవారు కాదు. పైగా, మీ చేతులోనే హత్యచేసేనారేమో ! ఈ దుష్టచర్యలకు దూరంగా వుండాలని మీకూ లేదు. ఆ అభిప్రాయమే వుంటే వాడు లంచం యిస్తున్నపుడే పుచ్చుకోకండా నాతో చెప్పేవారు. సరేలెండి. ఎలాగవుతేనేం–మీరు చేసిన సహాయం అమూల్యమైనది. మీ మేలు మర్చి పోలేము. ఇక మీరు వెళ్ళొచ్చు.

నర : (కథ అడ్డంతిరిగినందుకు నిరుత్సాహపడి) చిత్తం... (వెళ్ళబోతాడు.)

వెం : మరోమాట.

(నరసయ్య ఆగుతాడు)

వెం : ఆరోజు, ఎవరో అమ్మాయికి డబ్బు యెరగా చూపించి మా గజపతి యేమో అన్నాడని చెప్పి, హెచ్చరించి, మళ్ళీ మరోరోజు వచ్చి మా గజపతి కాడని చెప్పారు, అది కేవలం అబద్ధమేనా ?

నర : ఔనండీ !

వెం : ఎందు కలా చెప్పారు ?

నర : (తడబడి) గజపతిగారు నన్ను గాలించి వెదకి పట్టుకుని లంచమిచ్చారండీ ! అతనిమీద యెవరికీ దురభిప్రాయం కలక్కుండా వుండేందుకే, అలా చెప్పమన్నారండీ !

వెం : అదీ, అలా చెప్పండి. మీరు అతికినట్లు యే కథనైనా కల్పించగలరు. మీలాంటి లంచగొండిలు వుండటం వల్లనే, మా గజపతిలాంటివాళ్లు మరీ పశువులైపోతున్నారు. చూడండి నరసయ్యగారూ ! మీకు బలం వుంది. బుద్ధివుంది...ఎక్కడైనా వుద్యోగంచేసుకుని బ్రతకండి. ఉద్యోగం దొరకక్కపోతే, కనీసం కూలి చేసుకునైనా, నిజాయితీగా బ్రతకండి. అంతేగాని, డబ్బుకోసం యిల్లాంటి రాక్షసకృత్యాలకు పూనుకోకండి.

[నరసయ్య మొహందించుకుని బైటికి పోతాడు]

పురు : ఏవిఁటి బావా! యెన్నడూ మన యిళ్ళల్లో యిల్లాంటి వ్యవహారాలు కనీ వినీ యెరుగమే !

వెం : కాల మహాత్మ్యం బావా! మా గజపతి అదుపాజ్ఞల్లో లేకుండా, బాగా గాలిబారిపోయాడు. వాడికి భార్య చనిపోయాక మా శాంతను పెళ్ళిచేసుకోవాలన్న బుద్ధిపుట్టింది. వాళ్ళక్క అతడికి తాళం వేసి ప్రోత్స హించింది. కాని, యిటు శాంత, శివం, నేను వ్యతిరేకం. మా దృష్టిలో రామం వున్నాడని పసిగట్టాడు గజపతి. అందుకే ఈ దుష్టప్రయత్నానికి పూనుకున్నాడు. (నవ్వి) ఏవిఁటో, అనుకుంటాంగాని మన ప్రయత్నాలన్నీ జరిగిపోతాయా చెప్పు? మనచేతుల్లో యేముంది? మనం కేవలం నిమిత్తమాత్రులం. అంతా దైవాధీనం.

పురు : (బాధగా) ఎలాగో ప్రమాదం తప్పిందిలే బావా! అమ్మాయి మరణంతోనే కృంగిపోయాను. ఇంక యిదొకటీ ! ఇంతకీ మారోజులు బాగా లేవు.

వెం : అమ్మాయిమరణం బాధకలిగించదని అనను. హృదయం తరుక్కుపోతుంది. అయినా అదే మనసులో పెట్టుకొని బాధపడ్డం మంచిదికాదు బావా! ఈ విషాదసమయంలో నేనీ ప్రసక్తి తీసుకురాకూడ

దనుకో; అయినా నీ వ్యథితహృదయానికి వూరట కలిగించడానికే చెప్తున్నాను.

పురు : ఏమిటది ?

వెం : రామంకీ శాంతకీ వివాహం చేసేస్తాను. ఇంక వుపేక్షిస్తే లాభంలేదు. మా ఆవిడ అడ్డుచెప్పడానికి వాళ్ళతమ్ముడి బండారం బైటపడిందిగా ! ఇక యెవ రేం చెప్పినా వినేదిలేదు.

[శాంత సిగ్గుతో తలవంచుకుని లోపలికి పోతుంది]

పురు : నిజంగానా బావా ?

వెం : నిజమే బావా! ఈ సమయంలోనా నీతో పరిహాస మాడతాను? ఈ ఆలోచన నాకు యెన్నాళ్ళనుంచో వుంది. అవుతే మా ఆవిడతో తగువుపెట్టుకోవటం యిష్టంలేక, గజపతిప్రవర్తన కాస్త అర్థమయ్యే వరకూ నే నిది బైటపెట్టలేదు.

పురు : సంతోషం పట్టలేకండా వున్నాను బావా! మా చెల్లెలు, పద్మ సజీవంగావుంటే వా ళ్ళెంతగా ఆనం దించేవారో!

(కళ్ళు ఒత్తుకుంటాడు)

వెం : అవన్నీ నెమరుకి తెచ్చుకోకు బావా! గతాన్ని విస్మ రించటం మంచిది.

('శివంగారూ' అని బైట కేక విన్పిస్తుంది)

శివం : (ద్వారందగ్గరికి పోయి) ఓ! సోమయాజులుగారా! రండి...రండి...

సోమ : (వస్తూ రామంని చూచి) ఊహించి వచ్చేశావా రామం? ఇంకా రాలేదేమో ననుకున్నాను.

రా : ఇప్పుడే వస్తున్నాంలే! ఏమిటి విశేషం?

సోమ: నీకు అపాయింట్‌మెంటు ఆర్డరు వచ్చిందోయ్... మీ యిల్లు తాళం వేసివుంటే, పోస్టుమన్ నాచేతి కిచ్చాడీ వుత్తరం. నువ్వు లేకపోయినా, శివంగారి చేతికిద్దామని వచ్చాను.

(ఓ కవరు అందిస్తాడు. అది చింపేవుంటుంది)

రాం : (ఉత్తరం చదివి) ఈ ఫ్లూర్లోనే ఉద్యోగం దొరికింది నాన్నా!

పుష : (ఆనందబాష్పాలు ఒత్తుకుంటూ) చీకటివెనుక వెన్నెలలా, దుఃఖంవెనుక అంతులేని సంతోషం ముంచుకొస్తుంది. ఏమిటో అంతా విధివిలాసం!

శివం : కంగ్రాచ్యులేషన్సు బావా! మనం వేస్తున్న నాటి కలోకూడా, నువ్వు అద్భుతంగా నటించా వనిపించు కుంటావు చూడు.

వెం : నాటకేమిట్రా? వేస్తున్నారా?

శివం : (నాలుక కరుచుకుని) ఆఁ...ఆఁ...అంటే, బావా వాళ్లూ ఓ నాటిక వేస్తున్నారెండి.

వెం : 'మనం' అన్నావు ? అందులో నువ్వూ పాల్గొంటు న్నావా ?

శివం : ఆ...అబ్బే ! లేదే !

రా : పాల్గొన్నా తప్పేవిఁటి మావఁయ్యా ?

వెం : తప్పనికాదురా; చదువు దెబ్బతింటుందని.

రా : ఎప్పుడూ దెబ్బతినదు మావఁయ్యా ! అది మనం చూపే శ్రద్ధపై ఆధారపడి వుంటుంది. కేవలం చదువుమీదే బుద్ధిని కేంద్రీకరించి వుంచటం కూడా కూడదు. వినోదాల్లోకూడా పాల్గొంటూవుండాలి.

వెం : హమ్మయ్యా, ఎంత వుపన్యాసం యిచ్చావురా ? (నవ్వుతాడు)

సోమ : సరేగానీ, పార్టీ యెప్పుడోయ్ రామం ?

శివం : మా బావ అన్నింటికీ ఒకేసారి పార్టీ యిస్తాడు లెండి.

సోమ: అన్నింటికీ అంటే ?

శివం : ఓ! అన్నట్టు మీకు తెలీదుకదూ ! మా బావకి పెళ్ళి కూడా నిశ్చయమయ్యింది.

సోమ: పెళ్ళా !

శివం : అదేవిఁటండీ అలా ఆశ్చర్యపోతారు ? మా చెల్లాయి నిస్తున్నాం.

సామ: ఐ సీ! మై హార్టీ కంగ్రాచ్యులేషన్సురామం. నీఅదృష్టం ఒక్కసారి చివురించిందోయ్...ఇక పుష్పించడమే

తరువాయి. (కరచాలనంచేస్తాడు) మరి నే వస్తాను. మనవాళ్ళందరికీ ఈ శుభవార్త అందజెయ్యాలిగా! వస్తానండీ శివంగారూ! (బైటికి నిష్క్రమిస్తాడు)

పురు : ఈ రోజు యెంతో సుదినం. మా శాంత మాయింట్లో అడుగుపెడుతుందని నిశ్చయించినపుడే మా రోజులు మారాయేమో!

శివం : (నవ్వి) అలా అనకండి. బావకి కోపమొస్తుంది. మనందరికంటె మా బావకి అభిమానం అధికం.

[అందరూ నవ్వుతారు]

వెం : పద బావా, లోపలికి.

[వెంకటేశ్వర్లు, పురుషోత్తం లోపలికి పోతారు]

రా : (తృప్తిగా నిట్టూర్చి) ఇప్పుడో యీ! నా జీవితంలో వెలుగు ప్రవేశించింది?

శివం : (నవ్వి) ఆ వెలుగు మా చెల్లేనేమిటి?

రా : (నవ్వి) అబ్బే! కాదు, నా అదృష్టం.

శివం : సరేలే! యేదో సరిపెట్టుకుందాం...

[గజపతి సూట్‌కేసు పట్టుకుని లోపల్నుంచివచ్చి రామం వేపు చురచుర చూసి బైటికి పోతూవుంటాడు.]

శివం : (మందహాసంతో) మామయ్యా! అప్పుడప్పుడు వుత్తరాలు రాస్తూవుండు.

(గజపతి మొహంచిట్లించుకుని పోతాడు. రామం, శివం నవ్వుకుంటూ యింట్లోపలికి పోతూవుంటారు.. చిన్నయ్య సిగరెట్‌పెట్టెతో వస్తాడు.)

చిన్న: బాబూ !

శివం: (తిరిగి) ఏంరా ?

చిన్న: మావయ్యగారు యింట్లోవున్నారాండీ !

శివం: (నవ్వి) సిగరెట్ పెట్టె తెమ్మన్నాడా యేవిఁటి ?

చిన్న: ఔనండీ !

శివం: నువ్వు యిటువేపునుండి వచ్చావు ఆయనేమో, స్టేషను వేపు పోతున్నాడు. పరుగెత్తివెళ్ళి యిచ్చేసిరా. ఎక్కువదూరం పోడులే !

చిన్న: చిత్తం...(వడిగా బైటికి పోతాడు)

(తెరపడుతుంది)

సమాప్తం.